# భాగ్యనగర శతావధానము

(1985 సెప్టెంబరు 2, 3, 4 తేదీలు)

శృంగేరి శంకరమఠము, నల్లకుంట, హైదరాబాదు-500 044.



శ్రీ శృంగేరీ శారదా పీఠాధిపతులు జగద్గురువులు

శ్రీశ్రీశ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వాములవారు

వారి అంతేవాసులు శ్రీశ్రీశ్రీ భారతీర్థ మహాస్వాములవారు

ప్రకాశకులు:

శ్రీ శృంగేరీ జగద్గురు శంకరాచార్య సమాహ్వాన సంఘము,

హైదరాబాదు.

# భాగ్యనగర శతావధానము

(1985 సెప్టెంబరు 2, 3, 4 తేదీలు)

శృంగేరి శంకరమఠము, నల్లకుంట, హైదరాబాదు-500 044.

శతావధాని: శ్రీ కడిమెళ్ల వరప్రసాదరావుగారు,

అధ్యక్షులు:

జగద్గురువులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థమహాస్వాములవారు

సంచాలకులు

డా॥ దివాకర్ల వేంకటావధాని

ప్రకాశకులు:

శ్రీ శృంగేరీ జగద్గురు శంకరాచార్య సమాహ్వాన సంఘము,

హైదరాబాదు.

సర్వస్వామ్య సంకలితము
ప్రథమముద్రణ: 1986.
మూల్యము-రూ. 8

ప్రతులకు:

శ్రీ శృంగేరి శారదాపీఠ పుస్తక విక్రయశాల
శృంగేరి (కడూరు)
కర్ణాటక, పిన్ 577139

శ్రీ శృంగేరి జగద్గురు శంకరమఠము
యూనివర్సిటీరోడ్డు, నల్లకుంట, హైదరాబాదు-500 044.

ముద్రణ:
సువర్ణ ముద్రణాలయము.
నల్లకుంట, హైదరాబాదు-500 044.



శ్రీశతావధాని శ్రీకడిమెళ్ళ వరప్రసాదరావు గారిని. అనుగ్రహించుచున్న శృంగేరీశారదా
పీఠాధిపతులు' జగద్గురువులు శ్రీశ్రీశ్రీభారతీ తీర్థ మహా స్వాములవారు.

శ్రీ శ్రీ జగద్గురు శంకరాచార్య మహాసంస్థానం దక్షిణామ్నాయ
శ్రీ శారదా పీఠం
శృంగేరీ-577139-కర్ణాటక

క్యాంపు: తెనాలి
తేది: 23-1-1986

శ్రీ శృంగేరీ జగద్గురు శ్రీ భారతీ తీర్థమహాస్వామివారు ఆంధ్రరాజధానియగు భాగ్యనగరమునందు చాతుర్మాస్యానుష్ఠానమునందున్న సందర్భమున శ్రీ చరణుల ఆజ్ఞతో శ్రీ కడిమెళ్ల వరప్రసాద శతావధానిగారు శతావధాన మొనర్చిరి.

చిన్న వయస్సులోనే ఈ అవధాన కళయందు విశిష్టమగు ప్రవేశమును సంపాదించిన వరప్రసాద శతావధానిగారు శ్రీ చరణుల పరమానుగ్రహమునకు పాత్రు లగుటయే గాక, అనేక సాహిత్య ప్రియులగు భావుకుల అభిమానమునకును పాత్రులయిరి. వారి శతావధాన పద్యములను, సమస్యల నిచ్చిన వారి స్వకీయపూరణలను గూడ, అచ్చొత్తించి ప్రకటించ వలసినదిగా శ్రీ చరణు లానతి చేసిరి. శ్రీ చరణుల యానతి మేరకు సమాహ్వాన సంఘమువారు ఈ పొత్తమును ప్రకటించుట ముదావహముగ నున్నది. "ఈ గ్రంథము సహృదయ హృదయాహ్లాదకమయి వెలుగొందుగాక!" యని, శ్రీ చరణు లాశీర్వదించినారు.

ఇట్లు,
టి. దక్షిణామూర్తి,
ఆంతరంగిక కార్యదర్శి

# తొలి పలుకు

దక్షిణామ్నాయ శ్రీ శృంగేరీ శారదాపీఠాధిపతులయిన జగద్గురు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వాములవారు, ఈ యేడు చాతుర్మాస్యవ్రతమును భాగ్యనగరమునందలి శంకరమఠమున నిర్వహించిరి. ఆ సందర్భమున శ్రీ స్వాములవారు శని, ఆది వారములయందు సాయంకాలమున తాము స్వయముగా అనుగ్రహ భాషణములు కావించి భక్తుల ననుగ్రహించిరి. ఇతర దినములలో సాయంకాలములందు ఆధ్యాత్మిక, సాహిత్య, ఉపన్యాసాది కార్యక్రమము లెన్నియో ఏర్పాటు చేయబడినవి. ప్రతి రోజు సాయం సమయములందు శ్రీ స్వాములవారు స్వయముగా శ్రీ శారదా చంద్రమౌళీశ్వరుల పూజ కావించెడివారు. భక్తులకు తీర్థ ప్రసాదము లొసగబడినవి.

జగద్గురువులవారు ఈ చాతుర్మాస్య సమయమున శతావధానము జరిపించవలయునని ఆజ్ఞాపించి యుండుటచే, శతావధానము సమర్థతతో నిర్వహించువా రెవరైన ఉన్నారా! అని ఆన్వేషింపగా, నరసాపురమందలి టైలర్ హైస్కూలులో ఆంధ్ర పండితుఁడుగా పనిచేయుచున్న "భాషాప్రవీణ" శ్రీ కడిమెళ్ల వరప్రసాద శతావధాని, M.A. గారు, రెండు మూడు శతావధానములను నిర్విఘ్నముగను, పండిత జన రంజకముగను ఒనర్చియుండిరని తెలియవచ్చినది. వారికి లేఖ వ్రాయగా జగద్గురువుల సమక్షమున శతావధానము చేయజాలుట తమ భాగ్య

విశేషమనియు, తాము తప్పకవచ్చి శతావధాన ప్రక్రియ నిర్వ హింతుమనియు సమాధానము వ్రాసియుండిరి. జగద్గురుపులవారి అనుజ్ఞనంది వారి నాహ్వానించుటయు, వారు శంకర మఠమునకు వచ్చి, సెప్టెంబరు 2, 3, 4 తేదీలలో ప్రాతః స్సాయంకాలము లందు మొత్త మారు సమావేశములలో శతావధానమును పూర్తి కావించుటయు జరిగినది.

సెప్టెంబరు 2వ తేది ఉదయము 9 గంటలకు జగద్గురు శ్రీ భారతీతీర్థ మహాస్వాములవారి సంస్కృతాశీస్సులతో శతావ ధాన సభ ప్రారంభమైనది. పిమ్మట ఆచార్య దివాకర్ల వేంక టావధానిగారు శతావధాన ప్రక్రియను, శతావధాని శ్రీ కడిమెళ్ళ వరప్రసాదరావుగారిని సభకు పరిచయము చేసిరి. పిమ్మట ఆ సమావేశమున శతావధానిగారు 20 సమస్యలకు, 20 వర్ణనల కును ప్రథమ పాదమును పూరించిరి ఆ నాటి సాయం సమా వేశము 5 గం॥లకు ప్రారంభమైనది. అవధానిగారు మరల 20 సమస్యలకు, 20 వర్ణనలకును, ప్రథమ పాదమును పూరిం చిరి. 3వ తేదీ ఉదయము 8-30 గం. లకు సభ ప్రారంభ మైనది. అందు, అవధానిగారు, మిగిలిన 11 సమస్యలకును, 11 వర్ణనలకును, మొదటి పాదములను చెప్పిరి. పిమ్మట 30 సమ స్యలకు ద్వితీయ చరణములను పూరించిరి. ఆ నాటి సాయం సమావేశమున తక్కిన 21 సమస్యలకు 50 వర్ణనలకును,

రెండవ పాదమును పూర్తి చేసిరి. 4వ తేది ఉదయము 51 సమస్యలకును మూడవ పాదము పూరించుట జరిగినది. ఆ నాటి సాయంకాలము 50 వర్ణనలకు, మూడు, నాలుగు పాదములను చెప్పి, శతావధానిగారు చక్కని ధారణా పటిమతో 51సమస్యా పద్యములను ఇంపుగా పఠించి, శ్రోతల కానందమును కలిగించిరి. మధ్య మధ్య, అప్రస్తుత ప్రశంసలు కూడ సభలకు వన్నె చేకూర్చినవి. ఈ యారు సమావేశములందును జగద్గురు పూ॥ శ్రీ భారతీతీర్థ మహాస్వాములవారు పరమానుగ్రహముతో సభ్యక్షపీఠము నలంకరించియుండి, యవధానమును దిలకించుచు, తమ యసాధారణ మేధా సంపత్తి వెలయ నెడనెడ చతురోక్తులు సంభాషించుచు శ్రోతలను రంజింపజేసిరి.

ఈ శతావధాన ప్రక్రియకు వందమంది పృచ్ఛకులు లభించనందున సుమారు 25 మందికి రెండేసి యంశము లిచ్చుట జరిగినది. శతావధానము నిర్విఘ్నముగా పూర్తియైన పిమ్మట జగద్గురు భారతీతీర్థమహాస్వాములవారు శతావధానిగారిని ఆశీర్వదించి, సువర్ణాంగుళీయకమును, సేలువను, వారికి బహూకరించిరి. ఆహ్వాన సంఘమువారు శతావధాని గారికి అయిదుసూర్ల పదునారు రూప్యములు పారితోషికముగా నొసంగిరి. ఈ యవధాన సమావేశములకు శ్రద్ధాళువులై వచ్చి, యవధానిగారి పద్యముల నాలించి, యానందించిన శ్రోతలును, సుమారు సహస్ర రూప్యములను శతావధాని గారికి సమర్పించి

గౌరవించిరి. శ్రీ స్వామి వారి యనుగ్రహముచే శతావధానము నిర్విఘ్నముగను, జయప్రదముగను ముగిసినది.

అవధాన విధానము, ఆంధ్రప్రదేశమునకు ప్రత్యేక మైనది. తిరుపతి వేంకటకవులు మున్నగువారును పలు రాజాస్థానములలో అష్ట శతావధానము లొనర్చి యఖండఖ్యాతి నార్జించుట మనకు విదితమేగదా! వారికి పిమ్మట పలువురు అష్టావధానము చేయుచున్నను, శతావధానము చేయువారి సంఖ్య అరుదై పోయినది. ఆ కళను పునరుద్ధరింపవలయునను నుద్దేశము చేతనే శ్రీ స్వాములవారు, ఈ కార్యక్రమమును జరిపించవలయునని సంకల్పించి, పూర్తి కావించిరి.

శతావధాని గారు చెప్పిన పద్యములు విస్మృతములై పోకుండునట్లుగా వానిని ముద్రించి, గ్రంథస్థము చేయుట మంచిదని శ్రీ స్వామివారు ఆనతిచ్చుటచే వానిని గ్రంధరూపమున ముద్రించుట జరిగినది. శ్రీ స్వామివారు సమస్యల నిచ్చిన పృచ్ఛకులను గూడ, వారివారి పూరణలను తెచ్చియిమ్మని ఆనతిచ్చిరి. వారిలో నైదారుగురు దక్క తక్కినవా రందరును, పత్రములపై వ్రాసి తమ తమ సమస్యాపూరణలను శ్రీ స్వామి వారికి సమర్పించిరి. శతావధానిగారి సమస్యాపూరణ పద్యములతోపాటు, పృచ్ఛకుల పూరణ పద్యములు గూడ ఇందు ముద్రింపబడినవి. పృచ్ఛకుల నామములును, వారిచ్చిన సమస్యావర్ణనల వివరణమును, ఈ గ్రంథమున ముద్రింపబడినవి. ఈ ముద్రణా

కార్యభారమును, శ్రీ స్వాములవారి యాజ్ఞచే, శ్రీ తంగిరాల ఆంజనేయశాస్త్రిగారికి అప్పగించుట జరిగినది. వారు శ్రమ నెంచక, నుత్సాహములో దీనిని చక్కగా నిర్వహించిరి. శ్రీ స్వామి వారు ఆధ్యాత్మిక విషయములందే కాక, సాహిత్య విషయము లందు గూడ ఆదరము చూపుచుండుట, పండితుల యందును, కవుల యందును వారికి గల అనుగ్రహమునకు తార్కాణ మగుచున్నది. చిఱుతప్రాయమునందున్న యువకులైనను శతావధానమును సమర్థతతో నిర్వహించిన శ్రీ వరప్రసాద శతావధాని గారికిని, ఆహ్వానించిన వెంటనే వచ్చి, పృచ్ఛకులుగా వ్యవహరించిన విశ్వవిద్యాలయ ఆచార్యులకును, ఉప న్యాసకులకును, కవి పండితులకును, నిశ్శబ్దముగా కూర్చుండి, శతావధానము నవలోకించి, ఆనందించి, శతావధాని గారిని యథోచితముగ సత్కరించిన శ్రోతలకును, ఈ గ్రంథమును ముద్రించుటలో తోడ్పడిన శ్రీ తంగిరాల ఆంజనేయశాస్త్రి గారికిని, మా కృతజ్ఞతాభివందనములు. ఆంధ్రదేశమునకు ప్రత్యేకమైనదియు, పాండిత్యము, జ్ఞాపకశక్తి కలిగి, కష్టసాధ్యమైనదియు నగు నీ శతావధాన కళను, ప్రభుత్వమువారును, ప్రజలును ప్రోత్సహించి, అది మరల పూర్వమువలెనే ప్రచారము నందుటకు తగిన ప్రయత్నము లొనర్తురని ఆశించుచున్నాము.

ఇట్లు,

ఆహ్వాన సంఘము వారు,

హైదరాబాదు.



శ తా వ ధా ని

శ్రీ కడిమెళ్ళ వరప్రసాదరావుగారు

# సమస్యలు - వాని పూరణలు

సమస్య - 1 పృచ్ఛకుఁడు : శ్రీ కేశవవంతుల నరసింహశాస్త్రి.

సమస్య :- 'రాతికి కండ్లు గిఱ్ఱుమనె వ్రాలె తనూలత భస్మ శేషమై.'

అవధాని పూరణ :-

ఉత్పలమాల

చేతమునందుఁ గామమును జేర్పఁగయత్నముఁ జేయనెంచి, యా
నీతునిఁజేసి మన్మథుని నేర్పుగ ముందుకుఁద్రోయ. పుష్పసం
ఘాతమునోఁకి యాగ్రహము క్రమ్మ్కొనన్ నిరసించు శంబరా
రాతికి కండ్లు గిఱ్ఱుమనె వ్రాలె తనూలత భస్మశేషమై॥

పృచ్ఛకుని పూరణ :-

శీతనగాత్మజా కరకుశేశయ పూజనలందు శంకరున్
ప్రీతమనస్కుఁగా, గృహిగ, వేగమెచేయ సుమాస్త్ర మేయుచున్
భూతపతి ప్రపుల్లమగు భ్రూకుటినేత్రము జూడ శూర్పకా
రాతికి కండ్లు గిఱ్ఱుమనె; వ్రాలె తనూలత భస్మశేషమై॥

సమస్య - 2   పృచ్ఛకుఁడు : శ్రీ శలాక రఘునాధశర్మ.

సమస్య :- రవయుతమౌనమున శంకరప్రభుఁగొలిచెన్.

అవధానిపూరణ :-

కం॥ అవిరళముగఁ గృషి సలుపుచు
సవిశేషముకాఁగ విషయ సాకల్యమునన్
భవదూరుఁడు కాఁగఁ బ్రణవ
రవయుతమౌనమున శంకరప్రభుఁగొలిచెన్॥

పృచ్ఛకుని పూరణ :-

భవబంధ వినిర్ముక్తికి
దవిలిమనము, సుజనుఁడొకఁడు తత్పరమతియై
యవిహతి నోంకారాంతా
రవయుత మౌనమున శంకరప్రభుఁ గొలిచెన్॥

సమస్య - 3 పృచ్ఛకుఁడు : శ్రీ బి. ఆర్. శాస్త్రి

సమస్య :- సీత రామున కేమౌనొ చెప్ప గలనె !

అవధాని పూరణ :-

తే॥ గీ॥ కపివరేణ్యుఁడ ! నాపైని గృప వహించి
నాథుఁ దోడ్కొని రమ్మని నాతి పలికె
లంకఁ గాల్చితి నా శిఖులన్ నశించె
సీత రామున కేమౌనొ చెప్పఁగలనె !॥

పృచ్ఛకుని పూరణ :-

బౌద్ధగాథలు రాముని భగిని యనును
భార్యగా జూపె వాల్మీకి వాఙ్మయమ్ము
ప్రకృతియని పల్కు నధ్యాత్మ రామకృతియు
సీత రామున కేమౌనొ చెప్పగలనె !॥

సమస్య - 4 పృచ్ఛకుఁడు : శ్రీపుల్లెల శ్రీరామచంద్రుడు

సమస్య :- హార ముదారమైన పరిహారము నొందు నశేషదోష
ముల్.

అవధాని పూరణ :-

వీరవరేణ్యులై చెలఁగి విజ్ఞతఁ గొల్పెడి భక్తసంఘమున్
ధారుణిఁ బ్రోసిరాజనుచు ధార్మికశక్తినిఁ గూలనేయ, దూ
ఱీర విశేషముల్ విడువ నేర్పుమెయిన్ మహి రాక్షసాళి సం
హార ముదారమైన పరిహారము నొందు నశేషదోషముల్॥

పృచ్ఛకుని పూరణ :-

క్షీరము దుర్లభంబగు నశేషము ధాన్యము పండ్లుగేహ సం
భారము మూల్య మాకసముపై విహరింపగ ధ్యానమాత్ర సం
చారిత నొందె నైన నవిచారిత వైద్యులు బోధసేతు రా
హార ముదారమైన పరిహారము నొందు నశేషదోషముల్॥

సమస్య - 5   పృచ్ఛకుఁడు : శ్రీ ధూళిపాళ గోపాలకృష్ణ

సమస్య :- సీతను చూచు కోఁతులకు సింహము పుట్టెర చూడ చిత్రమై.

అవధాని పూరణ ;-

ఆ తలిరాకుఁబోఁడిని రయంబునఁ గైకొని పోవునాఁడు సం
పాతి గ్రహించి చెప్పనెడ వాయుతనూజుఁడు వానరేంద్రుఁడై
యా తగులాట రాక్షసుల నంతము జేయఁగ రాక్షసీతతుల్
సీతను చూచు కోఁతులకు సింహము పుట్టెర చూడ చిత్రమై॥

పృచ్ఛకుని పూరణ :-

భూతలనాథ! వేరొకటి భూమిపయింగలదంచు దెల్పనా
చేతల మాయగాడు తన చేతగు టక్కుటమారవిద్యల
న్నాతల సీతలన్ బెరుకనాలుక కన్వితమాయెగా నహో
సీతను చూచుకోతులకు సింహము పుట్టెర చూడచిత్రమై॥

సమస్య - 6 పృచ్ఛకుఁడు : శ్రీ పి. ఎస్. ఆర్. ఆంజనేయశాస్త్రి

సమస్య :- నేనును మాన్యుడన్ పరమనీచుడ శాంతిని ప్రోత్స హించుటన్

అవధాని పూరణ :-

జ్ఞానవిహీనతన్ బరఁగుచాడ్పునఁబోవు జగమ్మునందు వి
జ్ఞానము బోధసేయుటకు శాంతినిఁ గూర్పఁగ నోపకుంటి, వి
జ్ఞానమునొంది మాన్యుఁడను, జ్ఞానవిహీనులయందు నీచుఁడన్,
నేనును మాన్యుఁడన్ పరమనీచుఁడ శాంతిని ప్రోత్సహించుటన్॥

పృచ్ఛకుని పూరణ :-

కాను మహాత్ముడన్, మనసుకల్గిన వాడను మాత్రమే సుమా,
మౌనిని కాను, యోగియని మంత్రవిదుండని చెప్పరాదు న,
న్నేనయ సూత్రముల్ తెలియ వింతకు; జీవనశాంతి కోరితిన్;
నేనును మాన్యుడన్, పరమనీచుడ శాంతిని ప్రోత్సహించుటన్॥

సమస్య - 7 పృచ్ఛకుఁడు:- శ్రీ కె. వై. యల్. నరసింహారావు

సమస్య :- భానుడు గ్రుంకె పూర్వదిశ భాసిలు వార్ధితరంగ
వాటిపై.

అవధాని పూరణ :-

ఉత్పలమాల

మానినియే తలంపునకు మాన్యత నిచ్చెడివేళ గాలియున్
వానయు సంక్రమించెను దుపానుగ మాఱెను బశ్చిమాబ్ధిలోన్
దానవజేసి యౌర్వశిఖి తార్క్యాను వేళలయందుఁ జిత్రపుం
భానుఁడు గ్రుంకెఁ బూర్వదిశ భాసిలు వార్ధితరంగవాటిపై॥

పృచ్ఛకుని పూరణ :-

పూని మహాత్మతేజమును పూజ్యుడు జవ్‌హరు శక్తి యుక్తులున్
ధీనిధి లోకమాన్యుని ప్రదీప్త సుదీక్ష, పటేలు వాణియున్
జానపద ప్రభంజనము జైయని దాక బ్రిటీషురాజ్యపుం
భానుడు గ్రుంకె పూర్వదిశ భాసిలు వార్ధితరంగవాటిపై॥

సమస్య - 8 పృచ్ఛకుఁడు : శ్రీతిరుమల శ్రీనివాసాచార్య

సమస్య : రతిభావాంబుధి నోలలాడితి కవీ ! రమ్యావధానమ్మునన్

అవధాని పూరణ

తతవైదుష్యవిశేష సంగ తులతోఁ దార్కొన్న నీ బుద్ధికిన్
స్మృతియై సద్గతియై విశేషనతియై సింగారముం జూపు సం
గతి గైకొన్న కవిత్వ సుందరికి శ్లోకస్థానముం గూర్చు భా
రతి భావాంబుధి నోలలాడితి కవీ ! రమ్యావధానమ్మునన్॥

పృచ్ఛకుని పూరణ :-

వితతమ్మైన కవిత్వ వైభవముతో విద్వాంసులన్ బద్య సం
తతులం దృప్తులఁజేసి వెల్గితివి నీ ధైర్యమ్మె ధైర్యమ్ము నీ
శ్రుతిచే నా హృదయమ్ము పొంగినదిలే చోద్యమ్ముగాఁ దల్లి భా
రతి భావాంబుధి నోలలాడితి కవీ ! రమ్యావధానమ్మునన్॥

సమస్య - 9          పృచ్ఛకుఁడు : శ్రీ పేరాల భరతశర్మ

సమస్య :- వాసనలేకయున్ యతియు ప్రాసయు లేకయు
చంపకం బగున్

అవధాని పూరణ :-

ఉత్పలమాల

ఆ సరసీరుహాక్షి తనువందు విశేషము లేమి చెప్ప వ్యా
ఖ్యానము గానరాదు రసతత్త్వముఁ జూపెడివేళ నాపయిన్
నాసిక రామరాజకవినాథునకున్ ముదమందఁ జేయునే
వాసన లేకయున్ యతియు ప్రాసయు లేకయు చంపకం బగున్॥

పృచ్ఛకుని పూరణ :-

ఒక ప్రియుడు ప్రియురాలితో నిట్లనెను.

"ఓ సుకుమారి ! మన్మధమహోగ్ర సుమాతిగ బాణధారవే !
నా సఖి ! మన్మనఃప్రియ ! వినానిను నేనును నుండలేను కా
దే, సరసాంగి! సీదయిన యింపగు నామ మదెంత ముద్దహో !
వాసన లేకయున్ యతియు ప్రాసయు లేకయు చంపకం బగున్॥

సమస్య - 10

పృచ్ఛకుఁడు :- శ్రీ చిలుకూరి అమరవరప్రసాద్

**సమస్య :- జగము లెరిగిన ద్విజునకు జందెమేల ?**

**అవధాని పూరణ :-**

తే॥గీ॥ భాష తెలిసిన వానికి వేషమేల ?
రోస మెఱిఁగిన వానికి మీసమేల ?
భక్తి నెఱిఁగిన వానికిఁ బ్రతియేల ?
జగము లెఱిఁగిన ద్విజునకు జందెమేల ?

**పృచ్ఛకుని పూరణ :-**

బిచ్చ మడిగెడు వానికి బొచ్చయేల
ఇచ్చ లుడిగిన వానికి రచ్చలేల
బట్టవలలకు దువ్వెన పాటదేల
జగము లెరిగిన ద్విజునకు జందెమేల॥

సమస్య - 11 పృచ్ఛకుఁడు :- శ్రీ లంకా సీతారామశాస్త్రి

సమస్య :- సీతను జంపెనంచు నిరసించెను వాలి ముదంబు తోడుతన్.

అవధాని పూరణ :-

ఉత్పలమాల

నాతినిఁ గోతిఁజేయఁగల నాధుఁడు రాముఁడు కోఁతినాధుఁడై
కోఁతినిఁ జేరి వేఱొకఁడు కోఁతినిఁ జంపుటఁ జూడఁ జిత్రమై
చేతమునందుఁ దోఁచుఁ బగచెల్లును రావణుఁ డొక్కనాట నీ
సీతను జంపెనంచు నిరసించెను వాలి ముదంబుతోడుతన్॥

పృచ్ఛకుని పూరణ :-

ఆతతబుద్ధి రాముడు నిజాశ్రిత ధీయుతి నన్నువీడి సం
జాతకృపన్ మదీయ సహజన్ముని యాచనజేసె భార్యకై
ప్రీతిగ నన్ను గోరినను వెంటనె గూర్పనె సీతఁ బుణ్య మి
స్నీ, తనుఁ జంపెనంచు నిరసించెను వాలి ముదంబు తోడుతన్॥

సమస్య - 12 పృచ్ఛకుఁడు :- శ్రీ శివసూరి విశ్వనాధశర్మ

సమస్య : పగలే రాహువు పట్టె చందురుని యే పర్వంబు లేకుండగన్॥

అవధాని పూరణ :-

మత్తేభము

సొగసుం గూర్చు పదార్థసంతతులు సంశోభించి భాసింపఁగన్
ఖగమార్గంబునఁ బోవు చందురుని వీఁకన్ బర్వమందున్ మహో
రగమై రాహువు పట్టియుండె నకటా! గ్రస్తోదితుం డాయెనే
పగలే రాహువు పట్టెఁ జందురుని నే పర్వంబు లేకుండగన్॥

పృచ్ఛకుని పూరణ :-

తగురీతిం భుజియించి శూన్యతిథి మోదంబార మధ్యాహ్న వే
ళగ నున్నట్టియెడన్ శయింపగను వాలాయంబుగా నొక్కడున్
తగ నిద్రన్ గ్రహణంబుగాంచె కలలోఁ దానెంత యాశ్చర్యమౌ
పగలే రాహువు పట్టె చందురుని యే పర్వంబు లేకుండగన్॥

సమస్య - 13 పృచ్ఛకుఁడు : శ్రీ కె. రాజన్నశాస్త్రి

సమస్య :- రాముం డంగభవార్తిఁ జెందె, నకటా! రామాళి సేవింపగన్.

అవధాని పూరణ :-

శార్దూలము

భామారత్నము లెందఱేనియును సంవాస ప్రభాసిద్ధికై
యేమైపోదురొ యార్తిఁ జెంది యనఁ దా నిల్లాలి గేహంబునన్
సేమంబుంచి గమించినాఁడు రససిద్ధుండుగా నాశ్రితా
రాముం డంగభవార్తిఁ జెందె, నకటా! రామాళి సేవింపఁగన్॥

పృచ్ఛకుని పూరణ :-

రామున్ సర్వగుణాభిరాము మనుజవ్రాతేదితున్ సద్యశః
కాముస్ పట్టపదాభిషేక కలితున్గాఁ జేయఁబూనన్ గడున్
వామ బొటది చిన్ని భార్యవలనన్ భావించి స్వాత్మీభవద్
రాముం డంగభవార్తిఁ జెందె, నకటా! రామాళి సేవింపఁగన్॥

సమస్య - 14 పృచ్ఛకుఁడు :- శ్రీ తిరుమల శేషాచార్యులు

సమస్య :- పున్నమచంద్రుఁ జూచి వెలవోయెను సూర్యుడు తూర్పుకొండపై

అవధాని పూరణ :-

ఉత్పలమాల

అన్నలినాక్షి క్రొవ్వలపు నంతరమందు ఘటించి మించి సం
పన్నతనాథుఁ జేరి రతిభావవశీకృతుఁ జేయువేళ నా
వెన్నెలతేనిఁగూడ మఱపించు (వలపించు) ముఖమ్మును గాంచుచుండగా
పున్నమచంద్రుఁ జూచి వెలవోయెను సూర్యుడు తూర్పుకొండపై॥

పృచ్ఛకుని పూరణ :-

పున్నమరేయి తన్వలచి పోకలఁ బెట్టెడు కాంతుఁజూచి, యా
పన్నత నొంది "ఛాయ" బలవంతపు కోర్కులుఁ దీవరింపగాఁ
గ్రన్నన వెంటనంట బిగికౌగిలిఁ జేర్చి ప్రియాముఖంబునన్
పున్నమచంద్రుఁ జూచి వెలవోయెను సూర్యుడు తూర్పుకొండపై॥

సమస్య - 15

పృచ్ఛకుఁడు :- శ్రీ చిమ్మపూడి వేంకటసుబ్రహ్మణ్యం

సమస్య :- మార్తాండు డుదయించు నస్తగిరిపై మధ్యాహ్న కాలంబునన్

అవధాని పూరణ :-

శార్దూలము

ధూర్తుల్ దోషులు మానవాధములు ప్రాదుర్భావముంజెంద వి
ద్యార్తుల్ తక్కఁగ నర్థులే కఱవుగా వ్యాపించు లోకంబునన్
గీర్తుల్ దక్కనె ; యిట్టిపాతకములు నీకేకాదు పెక్కండ్రకౌ
మార్తాండుం డుదయించు నస్తగిరిపై మధ్యాహ్నకాలంబునన్॥

పృచ్ఛకుని పూరణ :-

మూర్తిం జెందిన షండరూపుడని భీష్ముంగూల్ప యత్నించునేన్
ధూర్తుండౌ ద్రుపదాత్మజుండవుర; తా ద్రోణున్ గురున్ జంపునే
నార్తింజెంది సుయోధనుండు రణమం దాపావనిన్ ద్రుంచునేన్
మార్తాండుం డుదయించు నస్తగిరిపై మధ్యాహ్నకాలంబునన్॥

సమస్య - 16 పృచ్ఛకుఁడు:- శ్రీ చిల్లర ప్రభాకరరాయశర్మ

సమస్య :- కరిమాలను చూడగానె కన్నులు మూసెన్.

అవధాని పూరణ :-

కం॥ పరపు కవిత్వమునందున
సరయమ్ముగ సాగఁగల్గు శాస్త్రార్థ విదుం
డురుగతిఁ గను కథ వాలియు
కరిమాలను చూడగానె కన్నులు మూసెన్॥

పృచ్ఛకుని పూరణ :-

అరి భీకర సమరములో
మరణించిన జేనిబదులు మరియొకవానిన్
వరియింపగ దా బోవుచు
కరిమాలను చూడగానె కన్నులు మూసెన్॥

సమస్య - 17 పృచ్ఛకుఁడు : శ్రీపరాయితం కృష్ణమూర్తిశాస్త్రి

సమస్య : మంగలవాడు నీమగడు మానిని రుక్మిణి చింత యేటికిన్.

అవధాని పూరణ :-

ఉత్పలమాల

సంగడియందు వర్ణనకుఁ జాలదు కృష్ణుని శక్తియుక్తి బా
ధంగొననేల ? సోదరుఁడు తార్కొనువేళ జయించి వచ్చి ని
న్నుంగొనిపోక నిశ్చయ మనుంజెలి ధూర్తులనుండి నిన్ను నో
మంగలవాఁడు నీ మగఁడు మానిని రుక్మిణి చింత యేటికిన్॥

పృచ్ఛకుని పూరణ :-

సంగరమందు యాదవుని సారము పిండెద బంధుకోటిలో
నం గడుపేరు కెక్కెదను నాతిని తెచ్చెద నన్నమాటలన్
గంగను కల్పిపోయెగదె గర్వము డిందగ భక్తపాళి నో
మంగలవాడు నీ మగడు మానిని రుక్మిణి చింత యేటికిన్

సమస్య - 18 పృచ్ఛకుఁడు : శ్రీపొర్లపల్లె యోగానంద్

సమస్య:- క్రుంకంజొచ్చెను తూర్పుదిక్కునను సూర్యుం డల్లదే చూడుమా !

అవధాని పూరణ :-

శార్దూలము

సంకోచం బొకయింతలేక సరసీజాతాక్షి కామప్రధా
నాంకంబౌ పురుషాయితంబునకు నాహ్లాదంబు సంధింపుచున్
జంకున్ బొందమిఁ దుష్టినొంది యిక చాలింపుమా! చంద్రుఁడున్
గ్రుంకం జొచ్చెను దూర్పుదిక్కునను సూర్యుం డల్లదే చూడుమా॥

పృచ్ఛకుని పూరణ లేదు

సమస్య - 19 పృచ్ఛకుఁడు :

శ్రీగంగరాజు వేంకటపూర్ణచిదంబరరావు.

సమస్య: మారుని బెండ్లియాడెను కుమార సవిత్రి తదేక చిత్తయై.

అవధాని పూరణ ;-

ఉత్పలమాల

పారవిహీనతం జెలఁగు భావవిశేషము శేముషీ ప్రభా
స్ఫారముగాగ, నీశ్వరుని స్వాంతమునందు వరించి చిత్త సం
భారమునందు నిల్పుకొని, పార్వతి కోరికపై నరీభవ
న్మారుని బెండ్లియాడెను గుమార సవిత్రి తదేక చిత్తయై॥

పృచ్ఛకుని పూరణ లేదు

సమస్య - 20 పృచ్ఛకుఁడు : శ్రీ యం. వెంకటేశ్వర్లు

సమస్య : భానుడు వెల్గుచుండ నొకపంక తమస్సులు క్రమ్మి వచ్చెడిన్.

అవధాని పూరణ :-

ఉత్పలమాల

ప్రాణములందుఁ దీపి యొక వంకను నర్జును డన్న భీతియున్
గానఁగరా, జయద్రధుఁడు కాన గరాక ప్రతిజ్ఞభంగమున్
గా నిడరాదటంచుఁ గర కంజము చక్రము సూర్యుఁ గప్పుచోన్
భానుఁడు వెల్గుచుండ నొకవంక తమస్సులు గ్రమ్మి వచ్చెడిన్॥

పృచకుని పూరణ :-

ప్రాణమునందుఁ దీపి మెయి నర్జును డన్న ప్రతిజ్ఞ లోపలన్
మానుగ దోప సైంధవుని మానసముం గలిగించుచుండ నా
దానవ శాత్రవుండు హరి తానొక మాయను గల్గజేయగా
భానుడు వెల్గుచుండ నొక వంక తమమస్సులు క్రమ్మి వచ్చెడిన్॥

సమస్య - 21 పృచ్ఛకుఁడు : శ్రీమూలా రామమూర్తి

సమస్య :- రాతిరివేళ భాస్కరుడు రమ్యముగా నుదయించె తూర్పునన్.

అవధాని పూరణ :-

ఉత్పలమాల

త్రేతలమేలువాఁడు పదివేసములం దొఁకఁ డైనవాఁడు, ఆ
యాతలిరాకుఁబోడులకు నందఱ కొక్కొక రూపువాఁడు, తాఁ
జేతములందుఁ బూర్ణరస సిద్ధి నిఁ జేర్పగ నాడు చెల్లగన్
రాతిరివేళ భాస్కరుడు రమ్యముగా నుదయించె తూర్పునన్॥

పృచ్ఛకుని పూరణ:-

వాతతనూజ భానుసుత వాలితనూభవ వహ్నిపుత్రకా
సేతువు గట్టు కాల మిదె, శీఘ్రముగా ,గొని రండు కొండ, లీ
రీతిని నిద్రబోవ నగునే మరి నిద్దుర బోవగానగున్
రాతిరివేళ, భాస్కరుడు రమ్యముగా నుదయించె తూర్పునన్॥

సమస్య - 22 పృచ్ఛకుఁడు : శ్రీ పరిమి రామనరసింహం

సమస్య :- రణమది యెల్లవారలను రంజిలఁజేసి ముదంబుఁ గూర్చెడిన్.

అవధాని పూరణ :-

చంపకమాల

గణగణ మంచు మ్రోగినవి గంటలు పిల్లలు పాఠశాల ప్రాం
గణమునఁ జేరినారు నునుగాంతులతో విలసిల్లు చుంద్రు; కా
రణము స్వతంత్ర పర్వమట! రమ్యతఁ గూర్చిన యట్టి పచ్చతో
రణమది యెల్లవారలను రంజిలఁ జేసి ముదంబుఁ గూర్చెడిన్॥

పృచ్ఛకుని పూరణ:-

క్షణమయినన్ విలంబమును సల్పక తిర్పతి వేంకటేశ్వరుల్
గుణముల కుప్పలో యనఁగఁ గోరినయట్లు శతావధాన మం
దున రసపుష్టిఁ బద్యములు నూటినిఁ జెప్పఁగ వారచూపు ధా
రణమది యెల్ల వారలను రంజిలఁ జేసి ముదంబుఁ గూర్చెడిన్॥

సమస్య - 23    పృచ్ఛకుఁడు : శ్రీజొన్నవిత్తుల
యజ్ఞనారాయణశాస్త్రి

సమస్య :- చెరప దలంతురే ఘనులు చిత్తములన్ పగవారి
నేనియున్.

అవధాని పూరణ :-

చంపకమాల

పరపు కవిత్వవైఖరి యపారముగా గమియించువేళఁ జి
చ్చఱ పిడుఁగౌఁచు వచ్చి, ఘనసారము కోల్పడు వీడియమ్ముగాన్
సరసము డిగ్గజేయును ప్రశంసల్తి ప్రస్తుతదూరుఁ డిత్తఱిన్
జెఱప దలంతురే ఘనులు చిత్తములన్ పగవారి నేనియున్॥

పృచ్ఛకుని పూరణ:-

నిరుపమ కావ్యతత్త్వ మిట నేర్వగనెంచి ముదంబుతోడుతన్
సరసులలోన జొచ్చితి విశాలమనోజ్ఞ వినోదహేతువౌ
సరణి ఘటిల్లె నాకు బుధసజ్జనసంగతి శారదాకృపన్
చెరప దలంతురే ఘనులు చిత్తములన్ పగవారి నేనియున్॥

సమస్య - 24 పృచ్ఛకుఁడు : శ్రీ దోసపాటి వేణుగోపాల్

సమస్య : పరమై మిక్కిలి యంతరంగమును తా బాధించె నిత్యంబు హా

శాస్త్రి

అవధాని పూరణ :-

మత్తేభము

వరమై యియ్యది పూర్వజన్మకృతమై వాగీశ్వరీ సత్కృపా
కరమై సాగు కవిత్వ సంగతులలో గందోయిలో రేణువై
వరలున్ దోషము వాపు వ్యాకరణమున్ భాష్యాంతమున్ జూచితో
పరమై మిక్కిలి యంతరంగమును తా బాధించె నిత్యంబు హా॥

పృచ్ఛకుని పూరణ :-

తరమే మాదృశ దుష్టకర్ములకు నుద్యత్పాపతప్తాళికిన్
తరణోపాయము గానలేక, జడబుద్ధింజేసి, సంజాతకా
తరభావంబులఁ జిక్కువారికిని, సంతాపార్ణవం బీదగన్
పరమై మిక్కిలి యంతరంగమును తా బాధించె నిత్యంబు హా॥

సమస్య - 25 పృచ్ఛకుడు : శ్రీ నడుపల్లి శ్రీరామరాజు

సమస్య :- రతిని గాంచి బ్రహ్మ రక్తుఁ డాయె.

అవధాని పూరణ :-

ఆ॥వె॥ వీణ చేతఁబట్టి వీనుల విందుగా
మ్రోయఁజేయువేళ హాయి నిడుచు
సరసకవిత మనకు సన్నిధిచేయు భా
రతినిగాంచి బ్రహ్మ రక్తుఁ డాయె॥

పృచ్ఛకుని పూరణ :-

సకలలోకమందు సరసత మెండుగా
నిలిపి కావ్యకన్యకలకు రూపు
దిద్ది తనకు ప్రతిగ దీర్చెడి సాధ్వి భా
రతిని గాంచి బ్రహ్మ రక్తు డాయె॥

సమస్య - 26 పృచ్ఛకుఁడు : శ్రీ ఏ. వి. సుబ్బారావు

సమస్య : కడిగె గుహుండు రామ పదకంజయుగమ్ము
భయమ్ము పెంపునన్.

అవధాని పూరణ :-

చంపకమాల

అడిగెద నొక్కమాట తగునాయని యోచన చేయఁబోకు, నీ
యడుగుల దుమ్ము సోకుట నహల్యగ మారెను రాయి యంద్రు, నేఁ
గడుగకయున్న నావ యొక కాంతగ మారునొ యేమొ యంచుఁ దాఁ
గడిగె గుహుండు రామ పదకంజయుగమ్ము భయమ్ము పెంపునన్॥

పృచ్ఛకుని పూరణ లేదు.

సమస్య - 27 పృచ్ఛకుఁడు : శ్రీ శిలే నారాయణ

సమస్య : వాసిగ గౌరికాత్మజుడు వారిజ శల్యుడు శౌరికల్లుడౌ.

అవధాని పూరణ :-

ఉత్పలమాల

ప్రాసయు దుష్కరంబయిన పట్టును గానఁగరాదు, ధీశ! సం
వాసము చేయు విఘ్నములు వర్తిలువాని, ననంగమూర్తినిన్
హాసముతో నదీపతిని నన్యపదమ్ముల చెప్ప మన్నచో
వాసిగ గౌరికాత్మజుఁడు వారిజ శల్యుఁడు శౌరి కల్లుడౌ॥

పృచ్ఛకుని పూరణ :-

బేసికనుల్ గలట్టి పెనువేలుపు ధూర్జటి భర్తయేపె కా
మాసతి కేమియౌను మఱి మన్మథుఁడెన్న రతీశుఁ డెవ్వఁడో
వాసుకి వైరి యెవ్వనికి వాజి కుమారుఁడు చక్రి కేమగున్
వాసిగ గౌరికాత్మజుఁడు వారిజ శల్యుఁడు శౌరి కల్లుడౌ"

సమస్య - 28 పృచ్ఛకుఁడు: శ్రీ తంగిరాల ఆంజనేయశాస్త్రి

సమస్య : అద్వైతస్థితిఁ బొందుచుందురు సదాఽహంబ్రహ్మ
యంచున్ జనుల్.

అవధాని పూరణ :-

శార్దూలము

విద్వేషమ్ములు లేవు రాగ మటులే వీసమ్ము నన్నంట దా
పై ద్వైతమ్ము సహింపఁబోనుఁ జెడు సంభాషింపఁగాబోనుఁ బా
దద్వంద్వంబును బట్టియుండుటనుఁ జిత్తంబుండు సం చెంచిరే
నద్వైతస్థితిఁ బొందుచుందురు సదాఽహంబ్రహ్మ యంచున్
జనుల్॥

పృచ్ఛకుని పూరణ :-

సద్వైద్యాగద మామయార్తులకు, నిచ్చల్, వ్యాధి పోగొట్టున,
ట్లద్వైతమ్ము, భవత్రసంగముల, తా, మాలించి. తచ్చింతనో
ద్యద్వైరాగ్య వినష్టకామరుజులై, ధర్మాత్ములై, సద్గురూ !
అద్వైతస్థితిఁ బొందుచుందురు, సదాఽహంబ్రహ్మ యంచున్
జనుల్॥

సమస్య - 29 పృచ్ఛకుఁడు : శ్రీ జె. వి. కృష్ణమూర్తి

సమస్య : రంభకు నుద్భవించెనట రాముడు లోకవినోద హేతువై.

అవధాని పూరణ :-

ఉత్పలమాల

దంభము సూపి రావణుఁడు తార్కొను వేళల ధర్మరక్షణా
రంభకుఁ డౌచు శాత్రవ విరాముఁడు కాఁగ జనింపనెంచి, తా
శుంభ దశేషశక్తి, గొని సూక్ష్మమతిన్ బరతత్త్వ రక్షణా
రంభకు నుద్భవించెనట రాముడు లోకవినోద హేతువై॥

పృచ్ఛకుని పూరణ :-

కుంభిని మేలుబంతియన కోసలరాట్సుత శ్రీజనంబుసన్
శుంభదభిఖ్య గాంచినను సూనుని గాంచకపోయె, పుత్ర సం
స్తంభము గల్గినన్, ఏబుడు చాల తమింగనె, నిష్టి సుత్రతా
రంభకు నుద్భవించెనట రాముడు లోకవినోద హేతువై॥

సమస్య - 30

పృచ్ఛకుఁడు : శ్రీ అవధానుల వేంకటలక్ష్మీనరసింహశాస్త్రి

సమస్య : రాముని చంపె రావణుడు రాజ్యము నిచ్చెను ధర్మరాజుకున్.

అవధాని పూరణ :-

ఉత్పలమాల

ఎమె! వసంతసేన! యరుదెంచుము నీ విటు, నన్నుచూడు, వి
గ్నానిని నేను, నీవు వెనుకాడకు, నేను పురాణ సంతతుల్
సాన పఠించినాఁడ, ఒక చక్కనిగాథను చెప్పమందువా!
రాముని చంపె రావణుడు రాజ్యము నిచ్చెను ధర్మరాజుకున్॥

పృచ్ఛకుని పూరణ :-

ఔమరి, ఆ విభీషణుడె, అంతటి లంకను, ధర్మరా జహో
కాముకుడైన రావణుడు కాలము చెల్లిననాడు గోరి తా
నైమరి, సీతదెచ్చి తనదైన వినాశము, నట్లు గోరగా
రాముని చంపె రావణుడు, రాజ్యము నిచ్చెను ధర్మరాజుకున్॥

సమస్య - 31 పృచ్ఛకుఁడు : శ్రీ జి. ఎం. రామశర్మ

సమస్య :- రవిచంద్రులు కలసినారు రమణీయముగాన్.

అవధాని పూరణ :-

కం॥ ప్రవిమల దివస మ్మియ్యది
యెవరే వచియించినార లిది దుష్ట మటం
చవురా అమవసనాడే
రవిచంద్రులు కలసినారు రమణీయముగాన్॥

పృచ్ఛకుని పూరణ :-

ప్రవిమల శీతల కాంతుల
ఖవిభాస సమంచితోష్ణ కాంతుల నీనన్
నవనీతచోరు కనులై
రవిచంద్రులు కలసినారు రమణీయముగాన్॥

సమస్య - 32 పృచ్ఛకుఁడు: శ్రీ గౌరీభట్ల రామకృష్ణశర్మ

సమస్య: తమతో రాగలరేమొ సాటిగ సినీతారల్
కళానైపుణిన్.

అవధాని పూరణ :-

మత్తేభము

గమికర్మీకృత నైకసీవృతుఁడనై గణ్యప్రపంచమ్మునం
దమలోదాత్త కవిత్వమార్గముల వ్యాఖ్యానించు సత్కావ్యముల్
సుమతుల్యంబులు వ్రాయు నాకు సరియా! స్థూలైక చక్షుష్కలా
తమతో రాగలరేమొ సాటిగ సినీతారల్ కళానైపుణిన్॥

పృచ్ఛకుని పూరణ :-

రమణీయంబగు దేవతాధిపు సుధర్మా నాట్యరంగస్థలిన్
సుమనఃపుంజము గాంచి సంతసిల నచ్చో నిల్చి యింపారు నృ
త్యము గావించి సురేంద్రు మన్ననల కర్హంబైన తాదృక్తిలో
త్తమతో రాగలరేమొ సాటిగ సినీతారల్ కళానైపుణిన్॥

సమస్య - 33 పృచ్ఛకుఁడు : శ్రీ కె. వెంకటస్వామి

సమస్య : తల్లికి మగ డైనవాడు ధన్యుడు ధరలో.

అవధాని పూరణ :-

కం॥ సల్లలితమ్ము కవిత్వము
వెల్లువయై చెప్ప శాస్త్రవిజ్ఞుం డవధా
నోల్లసితుండు, కళామ
తల్లికి మగ డైనవాడు ధన్యుడు ధరలో ॥

పృచ్ఛకుని పూరణ లేదు

సమస్య - 34 పృచ్ఛకుడు :

శ్రీ అక్కిరాజు సుందరరామకృష్ణ

సమస్య : సీతకు రావణాసురుడు చిన్నికుమారుడు నిశ్చయ
మ్ముగన్

అవధాని పూరణ :-

ఉత్పలమాల

సీతకు, బూర్వజన్మమని చెప్పిరి వేదవతీసతిన్ సురా
రాతికి కూతురంచు, విమలమ్ముగ నెమ్మది మందలించుటన్
నీతులు బోధసేయుటలు నేర్పుగఁ జూచిననాడు, మిత్రమా !
సీతకు రావణాసురుడు చిన్నికుమారుడు నిశ్చయమ్ముగన్ ॥

పృచ్ఛకుని పూరణ :-

పూతచరిత్రుడైన రఘుపుంగవు గాథ మనోహరంబుగా
పాతికవత్సరంబులకు పైబడి పాఠము జెప్పుచున్న మా
సీతయగారి కూతు రది, శ్రీమతి రంగమ తేల్చె నీగతిన్
సీతకు రావణాసురుడు చిన్నికుమారుడు నిశ్చయమ్ముగన్॥

సమస్య - 35 పృచ్ఛకుఁడు : శ్రీ చుండి లక్ష్మీనారాయణ

సమస్య : బిడ్డ డవ్వను మోహించి పెండ్లియాడె.

అవధాని పూరణ :-

తే॥ గీ॥ ధర్మమును నాల్గుతెరగులఁ దనరునట్లు
జేయువలదన్న ఫలమునే స్వీకరించి
కామమున కొట్టుకొనిపోయి కదలి దేవు
బిడ్డ డవ్వను మోహించి పెండ్లియాడె॥

పృచ్ఛకుని పూరణ :-

బాలగోపాలు బొందంగ భామ రాధ
హద్దులేనట్టి శాశ్వతానందజలధి
నోలలాడ ముమ్ముందుగ వలస వచ్చె
బిడ్డ డవ్వను మోహించి పెండ్లియాడె॥

సమస్య - 36 పృచ్ఛకుఁడు : శ్రీదివాకర్ల వేంకటావధాని

సమస్య : యని రారాయని తెల్పెనాఁదగె ద్విరేఫాద్యంత
రేఫధ్వనుల్.

అవధాని పూరణ :-

మత్తేభము

కనుగోకుండు మరంద మాశపడి, తా గై కోడు సంకేత మ
స్తనగం బంటెను భాస్కరుం డశికి బంధంబాయె పద్మంబు, గా
ఢనిశీథంబునఁ గుందఁ జాల నిఁక రాడాయంచు నాతమ్మిరా
యని రారాయని తెల్పెనాఁదగె ద్విరేఫాద్యంత రేఫధ్వనుల్॥

పృచ్ఛకుని పూరణ లేదు

సమస్య - 37 పృచ్ఛకుఁడు ; శ్రీ కేశవపంతుల
నరసింహశాస్త్రి

**సమస్య : పతితలఁగోసి వండె నొకభామిని యాత్రిక భోజనార్థమై.**

అవధాని పూరణ :-

చంపకమాల

సతియట లోకు లెల్లరును సాధ్వియటంచుఁ బ్రశంససేయగా
నతిథులు వచ్చుచుండునెడ నద్దమరేయిని భోజనంబు ను
న్నతముగ వండిపెట్టు నొకనాడు సుధీశులు వచ్చుటన్, వన
స్పతి తలఁగోసి వండె నొకభామిని యాత్రిక భోజనార్థమై ॥

పృచ్ఛకుని పూరణ :-

పతులు సతుల్ ప్రయాణమయి పర్వతయాత్రకు వెళ్లుచున్ క్షుధా
ర్తత నొకచోట వండుకొనఁ దండులముఖ్యములుండి సూపసం
గతికయి కూరలేవియును గన్పడకుండిన తింత్రిణీకురు
ట్పతి తలఁగోసి వండె నొకభామిని యాత్రిక భోజనార్థమై॥

సమస్య - 38 పృచ్ఛకుఁడు : శ్రీమేడిచర్ల అంజనేయమూర్తి

సమస్య ; విధవా ! రమ్మనుచు భార్య విభునిం బిలిచెన్,

అవధాని పూరణ :-

కం॥ మదనుం డంతరమందున
మథనం బొనరింపుచుండ మానిని సత్యా
స్పదుఁడూదగ పిల్లనగ్రో
వి, ధవా ! రమ్మనుచు భార్య విభునిం బిలిచెన్॥

పృచ్ఛకుని పూరణ :-

సుధరుచుల మించు రుచులకు
నిధులుగ నీకొఱకు వండి నేనుంచిన యా
మధురాహారము లున్నయ
వి, ధవా ! రమ్మనుచు భార్య విభునిం బిలిచెన్ ॥

సమస్య - 39 పృచ్ఛకుఁడు : శ్రీశలాక రఘునాథశర్మ

సమస్య : నస్య మర్థించి తపముండె నరవరుండు.

అవధాని పూరణ :-

తే॥ గీ॥ ఎన్నిజన్మల సీరీతి నెన్నిమార్లు
పొందవలెనింక నేటికి ముక్తి గలుగు,
నుండునన్నాళ్లు మంచిగా నుండ, సౌమ
నస్య మర్థించి తపముండె నరవరుండు॥

పృచ్ఛకుని పూరణ :-

తాపములనెల్లఁ బోకార్చి, ధర్మబుద్ధిఁ
గూర్చి, పార్వతీపతి పదాబ్జార్చనమ్మ
క్షణమయిన వీడనీని నిక్కమగు సౌమ
నస్య మర్థించి తపముండె నరవరుండు॥

సమస్య - 40 పృచ్ఛకుఁడు : శ్రీ బి. ఆర్. శాస్త్రి

సమస్య : కాలములందు మేలు కలికాలమె నీకిది, దేవ; జ్ఞాతమే!

అవధాని పూరణ :-

ఉత్పలమాల

ఆ లలితాంగి చిత్రములయందు నటించుట నేర్చియుండి, రూ
ప్యాలనుఁ బొందిఁ, పల్కె నవురా కలికాలమునందు చిత్రరూ
పాలను సృష్టిచేయగలవాడు నరుండు, నిజమ్ముగా చతుః
కాలములందు మేలు కలికాలమె నీకిది, దేవ ! జ్ఞాతమే ॥

పృచ్ఛకుని పూరణ :-

ఏలచరించినన్ ధనము నెట్లుగణించిన ధర్మహీనతన్
కాలిననైన మానవుల కాతువు నిన్ను స్మరించినంతనే
జాలి నటంచు వింటి నిది సత్యముగా నను బ్రోవ రాగదే
కాలములందు మేలు కలికాలము నీకిది, దేవ! జ్ఞాతమే ॥

సమస్య - 41 పృచ్ఛకుఁడు : శ్రీ ధూళిపాళ గోపాలకృష్ణ

సమస్య : రావణ కుంభకర్ణులకు రాముఁడు పుట్టెను ధర్మ మేలఁగన్.

అవధాని పూరణ :-

ఉత్పలమాల

రావము సల్పుచుండగను రావణనామము సార్థకంబుగన్
రావణ సోదరుం డగుట రావణుకంటెను స్థూలకాయుఁడై
కావలెనంచు దౌష్ట్యములు గర్వమతుల్ పొనరింప మృత్యువై
రావణ కుంభకర్ణులకు రాముఁడు పుట్టెను ధర్మ మేలఁగన్ ॥

పృచ్ఛకుని పూరణ :-

పావనమౌ చరిత్రగల పావనిఁ బ్రోచుఁ దలంపుతోడుతన్
భావన చేయగా,పరమపావని జానకి పొందుగోరి తా
బ్రోవగ సన్మునీంద్రులను బ్రోవ జటాయువు నెంచి మృత్యువై
రావణ కుంభకర్ణులకు రాముడు పుట్టెను ధర్మ మేలగన్ ॥

సమస్య-42 పృచ్ఛకుఁడు : శ్రీ పి.యస్.ఆర్. ఆంజనేయశాస్త్రి

సమస్య : గురుశంకరుఁడున్ భజించె గురుగోవిందున్.

అవధాని పూరణ :-

కం॥ వరశక్తిన్ ఘటియిల్లుచు
చరియించుచు శివమునందు జ్ఞానముగొని యీ
శ్వరుఁడనఁ జెల్లందగు, నా
గురుశంకరుడున్ భజించె గురుగోవిందున్ ॥

పృచ్ఛకుని పూరణ :-

కరుణన్ తా గోవింద
స్మరణన్ మూఢమతులందు చైతన్యశ్రీ
కరముగ చెప్పెనన,జగద్
గురుశంకరుడున్ భజించె గురుగోవిందున్ ॥

సమస్య - 43 పృచ్ఛకుడు: కె.వై.ఎల్. నరసింహారావు

సమస్య : అద్వైతమ్మది సంశయాస్పదము నింద్యమ్మయ్యె
నాస్తిక్యమున్

అవధాని పూరణ :-

శార్దూలము

విద్వాంసుల్ పలురీతులన్ పలుకుడుక్ విజ్ఞానవైశిష్ట్యముల్
ఉద్వేగంబును గల్గజేయు విషహాస్యోక్తుల్ ప్రవాహించిసం
పద్వైశిష్ట్యము నొందుమూఢులును, ధర్మభ్రష్టులౌవారియం
దద్వైతమ్మది సంశయాస్పదము నింద్యమ్మయ్యె నాస్తిక్యమున్॥

పృచ్ఛకుని పూరణ ;-

విద్వేషమ్మును జంపివేయగల సద్విజ్ఞానశాతాసి,యే
విద్వాంసుండును విఱవీగుటకు తావేలేని మార్గమ్ము,కృ
ష్ణద్వైపాయన సూత్రజీవిత పరాశాస్త్రమ్మభేదమ్ముగాన్
అద్వైతమ్మది సంశయాస్పదము నింద్యమ్మయ్యె నాస్తిక్యమున్॥

సమస్య - 44 పృచ్ఛకుఁడు ; శ్రీ తిరుమల శ్రీనివాసాచార్య

సమస్య : అవలీలఁగ బాల యెత్తె నశ్వము నంతన్.

అవధాని పూరణ :-

కం॥ అవకాశము కలిగినదని
కవలాచతురంగ మాడగా పనిపూనన్
అవునా అశ్వ మటంచును
అవలీలఁగ బాల యెత్తె నశ్వము నంతన్ ॥

పృచ్ఛకుని పూరణ :-

యువకులు చదరంగమున ప
రవశులుగా నుండి'కాఫి'త్రాగెడువేళన్
అవలోకించి హఠాత్తుగ
నవలీలఁగ బాల యెత్తె నశ్వము నంతన్ ॥

సమస్య - 45 పృచ్ఛకుఁడు: శ్రీ పేరాల భరతశర్మ

సమస్య: ద్రౌపది సీత యిర్వు రొక తండ్రికి బుట్టిన బిడ్డలే కదా.

అవధాని పూరణ :-

ఉత్పలమాల

ద్రౌపది కొంగు పట్టుకొను దౌష్ట్యముచేత సుయోధనుండు, భూ
జాపతి దౌలనుండ మహిజన్ గొనిపోవగ రావణుండు, సం
తాపము నొంది నాశనము దాల్చిరి, వారలు దైవపుత్రికల్
ద్రౌపది సీత యిర్వు రొక తండ్రికిఁ బుట్టిన బిడ్డలేకదా!॥

పృచ్ఛకుని పూరణ :-

ఒక తండ్రి తన కూతుండ్రతో నన్నమాఁ లివ్వి.

మీవయిఁ గూర్మిఁ బెంచితిని మిక్కిలి భారతసంప్రదాయ సా
ధ్వీపరమార్థతన్ మెలగుతీరున, పెట్టినపేర్లు సార్థకం
బై వరగంగ వర్తిలుఁడు నాపరమోత్తమ కాంతలట్టు ఁ
ద్రౌపది ! సీత ! యిర్వు రొక తండ్రికిఁ బుట్టిన బిడ్డలేక గా ॥

సమస్య - 46 పృచ్ఛకుఁడు : శ్రీ లంకా సీతారామశాస్త్రి

సమస్య : పుంస్త్వము లేనివాఁడొకఁడు పూనిక నల్వురతో రమించెఁగా.

అవధాని పూరణ :-

ఉత్పలమాల

పుంస్త్వము చూడఁగాదగును పోయితగాని వధానమందు, నా
పుంస్త్వ మదెంతపాటియని పూనికనూనుచు నిచ్చినార లీ
పుంస్త్వ మటంచు ప్రాస, తమ పుంస్త్వము చూచెద, పిచ్చిపల్కులా
పుంస్త్వము లేనివాఁ డొకఁడు పూనిక నల్వురతో రమించెఁగా॥

పృచ్ఛకుని పూరణ :-

సంగ్రతమైన బ్రహ్మమును సాంధ్య మొనర్చెడి కాలమందు లో
నం స్తుతిఁజేయ నందుల గనంబడె లింగవిహీన, మంతఁ దా
నం స్తుతియన్న, దేహికె, మనంబది వర్గచతుష్టయార్థ మా
పుంస్త్వము లేనివాఁ డొకఁడు పూనిక నల్వురతో రమించెఁగా॥

స్తు - స్త్వ - ప్రాసము ?

సమస్య - 47 పృచ్ఛకుఁడు : శ్రీ శివసూరి విశ్వనాథశర్మ

సమస్య : భర్తకు కంఠసూత్రమును భామిని గట్టె
భళీయనన్ జనుల్.

అవధాని పూరణ :-

ఉత్పలమాల

ఆర్తినిఁ జెందినట్టి యొక యాడుది పాడుదిగా దలంచి, కా
మార్తిని నన్యకాంతల సమాగమమంది బికారియయ్యె, వి
త్తార్తిని కాళ్ళమీదఁబడ, నాతని జాలిసగా, దలంచుచున్
భర్తకు కంఠసూత్రమును భామిని గట్టె భళీయనన్ జనుల్॥

పృచ్ఛకుని పూరణ :-

ఆర్తి దొలంగ నెవ్వనికి నంగనఁ జేయును సేవ ? దేనినిన్
భర్తయుఁ గట్టు లగ్నమున భార్యకు ? సాహసి యెవ్వఁడౌ
నిలన్ ?
కీర్తికి నబ్ధిరామః డల కీశయుతంబుగఁజేసె నేమ ? నన్
భర్తకు, కంఠసూత్రమును, భామిని, గట్టె భళీయనన్ జనుల్॥

సమస్య - 48 పృచ్ఛకుఁడు : శ్రీ కె. రాజన్నశాస్త్రి

సమస్య : నగధారి యనంగుఁ ద్రుంచె నాతిని బ్రోచెన్.

అవధాని పూరణ :-

కం॥ అగణిత శక్తియుతుండౌ
భగవంతునిమీద కుసుమబాణము లేయన్
దగులన్ గోపంబునఁ బ
న్నగధారి యనంగుఁ ద్రుంచె, నాతిని బ్రోచెన్॥

పృచ్ఛకుని పూరణ :-

అగజాతా గుణగరిమం
బగణితమై యున్కిఁ గుసుమబాణాహస్తున్
తెగఁగోయ నెంచి తా ప
న్నగధారి యనంగుఁ ద్రుంచె, నాతిని బ్రోచెన్॥

సమస్య - 49 పృచకుఁడు : శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు

సమస్య : ముక్తికి కారణము విషయభుక్తియె తలపన్.

అవధాని పూరణ :

కం॥ ముక్తుఁడు కానెంచినచో
రక్తుడు కాకుండవలయు, ~~రమణుఁడు విషయ~~
~~త్యక్తుం డెవ్విధిఁ జెల్లును~~
ముక్తికిఁ గారణము విషయభుక్తియె తలపన్॥

పృచ్ఛకుని పూరణ :

రక్తిమెయిన్ బహువిషయా
సక్తిన్ బెంపొందఁజేయ చలచిత్తమునన్
భక్తియు కుదరదు దురితా
ముక్తికి కారణము విషయభుక్తియె తలపన్॥

సమస్య - 50 పృచ్ఛకుఁడు: శ్రీ తంగిరాల ఆంజనేయశాస్త్రి

సమస్య : కప్పను గాంచి, పన్నగము కాతరమౌచును పాఱె మింటికిన్.

అవధాని పూరణ :

ఉత్పలమాల

చెప్పులు కిఱ్ఱుకిఱ్ఱుమనఁ జేత ధరించును దుడ్డుకఱ్ఱ, తా
నిప్పటి కెన్ని సర్పముల నెట్లు వధించెనొ చెప్పరాదు, నే
నిప్పటి కొక్కమార్గమున నేగుటయే సుఖమంచు నెంచి, వెం
కప్పను గాంచి పన్నగము కాతర మౌచును పాఱె మింటికిన్॥

పృచ్ఛకుని పూరణ :

అప్పుఁడు గారడీఁడు తన యద్భుతవిద్యను జూపుచుండగా
తప్పెట్లు మ్రోగ, బుస్సనుచు దాపునకుం జనుదెంచె సర్ప, మా
చొప్పున భేక మొక్కటియు చోద్యముగా నరుదెంచె వీఁక, నా
కప్పనుగాంచి, పన్నగము కాతర మౌచును పాఱె మింటికిన్॥

సమస్య - 51

పృచ్ఛకుఁడు : శ్రీ మల్లంపల్లి సుబ్రహ్మణ్యశర్మ

సమస్య : ఉమకుం దోడు శివుండు కాడు హరియే యూహించి భాషింపగన్.

అవధాని పూరణ :

మత్తేభము

సుమశస్త్రంబుల నేయు మన్మథుని నీశుం డల్లఫాలాగ్నిచే
నమలోదాత్త శరీరయుక్తు నశరీరాయత్తునిం జేసి య
య్యుమఁ బెండ్లాడిన గాథ నీవు వినవో యూహించి భాషింపగన్
ఉమకుం దోడు శివుండు కాడు, హరియే యూహించి భాషింపగన్॥

పృచ్ఛకుని పూరణ :

అమలోదంతులు శంకరుల్ నుడివి రాయాపట్టులన్ విష్ణువ
య్యె, మహేశానుని సామిభాగమని; యిట్లే శ్లోకముల్ పెక్కు కా
న, మదిం దోచెడి విష్ణుపార్వతుల యంతవ్యక్తియే యీశుడౌ;
యుమకున్ తోడు శివుండు కాడు, హరియే యూహించి భాషింపగన్॥

# అంశములు - వర్ణనలు

వర్ణన - 1  పృచ్ఛకుడు : శ్రీ రాచర్ల సూర్యనారాయణశాస్త్రి

అంశము : తల్లిదండ్రులకు ఎవరు ప్రయోజనకారులు ?
పుత్రులా ? పుత్రికలా ?

అవధాని వర్ణన :

వరశుల్క మనుపేర పైశాచిక ప్రవృత్తి
జగతియందున మేటి జగడ మాయెఁ
బొత్తిళ్ళలో బిడ్డఁ బొదిగి పెద్దగఁ జేసి
స్థితిమంతునిగఁ జేయఁ జెడుచునుండెఁ
బిల్లలే లేనట్టి చల్లని తల్లికి
బహుమానముల నిచ్చు ప్రభుత యాయె
బహుమానములు వీడి సహవాసములఁ బెంచి
సంతాన మంది పోషణకు లేక
వారి రహదారిపై నుంచు వారికన్న
ధరను నిరక్ష్యులై యున్న ధన్యులందు
నార్యవాదమ్ము లోకవంక, నవనిజనుల
వాద మొకవంక; నేనేమి పలుకఁగలను ?

వర్ణన - 2 పృచ్ఛకుఁడు : శ్రీ కె.వి. చలపతిరావు

అంశము : అకాల వర్షాలు ఎందుకు ?

అవధాని వర్ణన :

భగవంతునిపై భక్తిని
నగణితముగఁ బెంచునట్టి యార్యత పోయెన్
వగ పేటికి నీనాటికి
భగవంతుం డాగ్రహింప వర్షం బుడుగన్ ॥

వర్ణన-3 పృచ్ఛకుడు : శ్రీ యం.వి.యల్. నరసింహారావు

అంశము : భారతీర్థస్వామి వైభవము

అవధాని వర్ణన :

సంతసము నిండుకొన చెంతనిడి ప్రేమమెయి
వింతయగు వత్సలత స్వాంతమున నిండన్
దంతువునఁ బూవుల నసంతములు గూర్చునటు
లంతరము పద్యము లనంతములు గుప్పన్
బంతమున దీక్షఁగొని వింత నవధానత ర
హింతువని ధీమతి సుఖింతు వనుచున్ వే
దాంత విదులైన బుధు లెంతయును దీవనలఁ
బంతురన పూర్వకృత మెంత సుకృతంబా ॥

వర్ణన - 4        పృచ్ఛకుడు : శ్రీ పాతూరి నాగరాజు

అంశము : సభను ఉత్పలమాలలో వర్ణించుట.

అవధాని వర్ణన :

పండితు లుండవచ్చు ననివారణ నాశువుఁజెప్పు సత్కవుల్
మెండుగ నుండవచ్చుఁ గృషిమించిన వ్యాకరణంబునందు ను
ద్దండులు నుండవచ్చుఁ బలుతార్కికు లుండఁగవచ్చుఁ దప్పులే
కుండఁగవచ్చునే సలుపుచుండెడి యీ యవధానమందు నా
కండగనుండి నన్నుఁ బరిహాసము సేయరటంచు నెంచెదన్ ॥

వర్ణన - 5        పృచ్ఛకుఁడు : శ్రీ చక్రావధానుల రెడ్డెప్పధవేజీ

అంశము : మీ కవితాధారపై లయహారిలో

అవధాని వర్ణన :

కవనమును సలుపుటయు సవనమును సలుపుటయు
నెవరికయినను సుకృత మవునది యథార్థం
బవిరళకృషిని సలిపి ప్రవిమల రసము నిలిపి
తావచెలుల హితునిగుణ కవితలను వ్రాయన్
సవితృగతి నెఱుఁగునఁట పవనుగతి శిరఁగునఁట
కవిఘనత జగతిపయి నవనవత గొంచున్
కవనమతి నొసఁగుటను భవువినుతి సలిపెదను
పవలనక నిశియనక దివిజ జననాథున్ ॥

వర్ణన-6 పృచ్ఛకుఁడు : శ్రీ లక్ష్మింశెట్టి సూర్యనారాయణమూర్తి

అంశము: శతావధానిగారి కుడిపాపిడి వైశిష్ట్యము(ఆటవెలఁదిలో)

అవధాని వర్ణన :

కుడియు నెడమయైనఁ గూడదు దోషము
తమరు వినరె దేవదాసు పలుకు
పరఁగవలయు గాని పాపిడి యెటనున్న
కాదు దోషమని ప్రసాదు పలుకు ॥

వర్ణన - 7 పృచ్ఛకుఁడు : శ్రీ అద్దేపల్లి సోమనాధము

అంశము : వర్షాకాలములో మేఘాచ్ఛాదితుడైన చంద్రుడు.

అవధాని వర్ణన :

వర్షమందుఁ బరఁగుచుండు
హర్ష ముడిగి యబ్జవైరి
శీర్షమందుఁ జేరె బాధ
తర్ష మెసఁగఁ దారఁ జేరె ।

వర్ణన-8 పృచ్ఛకుడు: శ్రీ కొండూరి నారాయణమూర్తి

అంశము: ఉత్తమ సాహిత్యము ఎలా ఉండవలెను?

అవధాని వర్ణన:

హృదయమునందు సమ్మదము నేర్పడఁగావలె సం
పదలను గూర్పఁగావలయు భాసిలఁగావలె నా
పదలను గూర్పరా దిటుల వర్తిలుచో మహిఁ బా
యదు కవిశబ్ద మాతనిని నాతఁడె ధన్యుఁ డగున్ ॥

వర్ణన-9 పృచ్ఛకుడు: శ్రీ కొండూరి సుబ్రహ్మణ్యం

అంశము: జ్ఞానియైన నాస్తికుడు, అజ్ఞానియైన ఆస్తికుడు, విద్యావంతుడైన చోరుడు, కామాంధుడైన వృద్ధుడు - వీరిలోని సామాన్య గుణములు (ఉత్పలమాలలో)

అవధాని వర్ణన:

జ్ఞానవిహీనుఁడై చెలఁగుచాడ్పున ఆస్తికుఁ డైననేమి,వి
జ్ఞానముఁగల్గి నాస్తికత సాగినచో సుఖ మేమికల్గు,వి
ద్యానిధియయ్యుఁ జౌర్యపరతంత్రుఁడుకాఁగ ఫలంబు లేదు,కా
మానకు లొంగి వృద్ధుడును మాన్యుఁడు కాఁడిల మూఢు
లందఱున్ ॥

వర్ణన - 10 పృచ్ఛకుఁడు : శ్రీ ఈరని శ్రీరామశర్మ

అంశము :- కృష్ణరాయని మానసిక సౌందర్యము - అన్న పూర్ణాదేవి తొలిరేయి పడకగదిలో అతని జంప బోయిన సందర్భములో.

అవధాని వర్ణన : జలద వృత్తం.

హాసముతోడ మేను నుపహారముగాన్
దీసికొనంగఁజాల మిని దేవి! నిటుల్
రోసము నొందనేలకొ, మరుల్గొనఁ కా
వేశముఁబొందె నేనిఇటన విద్యుతతోన్॥

వర్ణన - 11 పృచ్ఛకుఁడు : శ్రీ హెచ్. హరిశ్చంద్రారెడ్డి

అంశము : గోమహిషమ్ములు లాగు బండిని సంసారముతో పోల్చి చెప్పుడు.

అవధాని వర్ణన :

గోమహిషమ్ములం గలిపి కూర్చినచో శకటప్రయాణమై
యీమహి నొప్పియుండఁ దగునే యిటు దంపతులుండఁ గోరుటల్
కామము ధర్మమార్గమున గాఢతనొంది సుఖప్రయాణమున్
సేమముతోడఁ జేయదగుఁ జెల్లుసుమీ యనురాగ మిప్విధిన్॥

వర్ణన - 12 పృచ్ఛకుఁడు : శ్రీ రాంభట్ల శివప్రసాద్

అంశము: వృద్ధుడు, శస్త్రచికిత్సలో నిపుణుడు, అయిన వైద్యుడు హఠాత్తుగా కవి అయినచో నాతని మనోభావా లెట్లుండును ?

అవధాని వర్ణన :

రుధిరంబట్లు రసంబు నింపఁదగనే రూప్యంబు లార్జింపనే
సదసద్యోచనఁ ~~జేసి భాగముల~~ నీషద్భేదరూపమ్ముగాన్
గదియింపం దగనే విశేషముగ నీకావ్యప్రపంచంబునం
దది కావ్యంబులె రత్నమై పరఁగదే ? ఆర్యుండఁ గాకుందునే॥

వర్ణన - 13 పృచ్ఛకుఁడు : శ్రీ అత్తలూరి రాధాకృష్ణమూర్తి

అంశము : శారదాదేవి మీద చంపకమాలలో.

అవధాని వర్ణన :

సరసకవిత్వవైఖరిని సన్నిధిసేయఁగలట్టి సన్నిధిన్
జిరయశ మబ్బఁజేయుటకుఁ జేయఁగ నెన్నొవధానప్ర~~క్రియల్~~
సరసమతిన్ స్మరించెదను శారద నివ్విధి భావవీథిలోఁ
బరుగులు తీయఁగాఁదగిన భాషయు భావము నా కొసంగఁగన్॥

వర్ణన - 14 పృచ్ఛకుఁడు : శ్రీ టి. రామగోపాల్

అంశము : సరస్వతీదేవి వీణాగానము చేయుచుండగా ఆమె గాజులశబ్ద మెట్లుండును ?

అవధాని వర్ణన :

స్వరసంధాన విధానమాధురులు విస్ఫారింపఁ దాళస్థితిన్
వరవీణామృదుపాణి పాణియుగ సంవాసంబు భాసింపఁగన్
గరయుగ్మస్థిత రత్నకంకణ ఝణత్కారంబు తోరంబుగన్
బరగున్ శ్రావ్యము భవ్యమౌచుఁ గడు దివ్యంబైన కావ్యంబుగన్॥

వర్ణన - 15 పృచ్ఛకుఁడు : శ్రీ కొమ్మరాజు రాధాకృష్ణమూర్తి

అంశము :- రాధాకృష్ణుల ప్రణయము త్రిమతాలకు ఏ విధముగా ఆరాధ్య మయినది ?

అవధాని వర్ణన :

ద్వైతాద్వైతములన్ విశిష్టమగు నద్వైతంబునందేని సద్
జాతంబౌ నొక భక్తియే యిరువురే సారూప్యమే యాశ్రితల్
గా తత్తన్మత తత్త్వవేద్యులగు లీలామోహనాకారుఁడున్
వ్రేతల్ తా మనురక్త లౌచు జగతీశ్రేయఃప్రదుల్ గావుతన్॥

వర్ణన - 16 పృచ్ఛకుఁడు : శ్రీ లంకా వెంకటసుబ్రహ్మణ్యం

అంశము : ఇందిరాగాంధి మరణవార్త విన్నప్పటి మీభావాలు.

అవధాని వర్ణన :

బలవంతుల్ బలహీనులన్ మలుపు దౌర్భాగ్యంబు పోథాడఁగా,
గలమే భావినిఁ జూడఁజూడ నొక 'స్టెన్‌గన్' క్రూరదృక్కాంతి కిన్
బలియై పోవుట కంచె చేసుదిను దౌర్భాగ్యంబు గాఁబోలు నీ
పలుకేదీ ప్రియదర్శినీ ! మధురవాగ్వైదుష్య మేపారఁగన్॥

వర్ణన - 17 పృచ్ఛకుఁడు : శ్రీ వి. నారాయణ

అంశము : భక్తివైరాగ్యాల మధ్యగల తారత్యము.

అవధాని వర్ణన :

భక్తియుండవచ్చుఁ బరఁగు భోగములందు
రక్తి నొందకుండు భక్తిఁ గొనఁడు
భక్తిగల్గి పైని వైరాగ్యముం గల్గు
వాఁడు ధన్యుఁ డనఁగఁ బరఁగుచుండు॥

వర్ణన - 18 పృచ్ఛకుఁడు : శ్రీ పి. నాగభూషణరావు

అంశము :- బైటసిటీబస్సులహోరు - ఇక్కడ ప్రశ్నలహోరు.
(శార్దూలవృత్తములో)

అవధాని వర్ణన :-

నేనే యంచును వాహనంబు లుహుఁ నేనేయంచుఁ బద్యంబులున్
నేనే యంచును నేనెయంచు మఱి నేనేయంచు నేనంచు నే
నే నేనే యని మీఁద మీఁదఁ బడుఁగాఁ బ్రేక్షకుల్ మెచ్చఁగన్
నానోటన్ వినిపించు పద్యముల యానందంబు సంధించెడిన్॥

వర్ణన-19 పృచ్ఛకుడు : శ్రీ జి. హనుమంతరావు

అంశము : విజయనగర రాజ్యస్థాపనకు విద్యారణ్యుల కృషి.

అవధాని వర్ణన :

కలి మించించు ముహూర్త మెంచుకొని శంఖధ్వానముం జేయఁగా
బలుకన్ వేఱొక జంగ మద్దరిని దా ధ్వానంబు గావింప వ్యా
కులతన్ జెందియు రాయసోదరులు శంకుస్థాపనం జేయఁగా
బొలిచెన్ మూడు సహస్రముల్ నిలువకే మున్నూఱు వర్షంబులే॥

వర్ణన - 20 పృచ్ఛకుడు : శ్రీ మోచర్ల నాగరాజు

అంశము : మీ అవధానవార్త నారదునివలన విని పార్వతీపర
మేశ్వరులు వచ్చినచో నెట్లుండును ?

అవధాని వర్ణన :

కలహముమాత్రమే తమకుఁ గావలెనంచు వచించుచుండు లో
కులు పలుగాకులౌచు నిటఁగూడు జనంబులు సాహితీపిపా
సులు,పలుపండితోత్తములు, సూక్ష్మమతుల్,కవిరాజరాజులున్
బొలయ శతావధానమును బొందికఁజేసె వరప్రసాదుడై ॥

వర్ణన-21 పృచ్ఛకుడు : శ్రీ బి. వేణుగోపాలాచారి

అంశము : దశావతారములు.

అవధాని వర్ణన :

పదివేసంబులయందు ధార్మికవిధిన్ భాసింపగా నెంచి, చె
ల్లెదు నీవక్కట పెక్కురూపముల వర్ణింపం దరంబౌనె,య
య్యదిగో మత్స్యము,కూర్మరాజము వరాహమ్మున్ నృసింహ
మ్ముపేం
ద్ర దశాస్యాంతక జామదగ్న్య హరి బుద్ధ స్ఫార కల్క్యాఖ్య
మున్ ॥

వర్ణన-22 పృచ్ఛకుఁడు : శ్రీ శేషం రామానుజాచార్యులు

అంశము : కనిష్క విమానప్రమాదముఅందించిన ఆకాశ వాణిపై.

అవధాని వర్ణన :

ఆకాశమ్మున వాణి నిల్చినది యయ్యాకాశ మార్గంబునన్
సాకల్యమ్ముగ యాత్రికుల్ జలధివాసం బెంచిరో యంచు,ది
వ్యాకారమ్మును జెందినా రనుచు దుఃఖాస్తోకమైనట్టి వా
ర్తాకాలుష్యము సోకునంత హృదయద్రాక్షేదముం గల్గెడిన్ ॥

వర్ణన - 23 పృచ్ఛకుఁడు : శ్రీ యస్. అనంతరెడ్డి

అంశము : జీవన్ముక్తి ఉపాయము.

అవధాని వర్ణన : [illegible]

పరుని కుపకారమును జేయఁ బరఁగనేని
యేరి కపకారమును జేయ నెంచదేని
ధన్యుఁడై వాఁడు ధరలోనఁ దనరుచుండు
ఇంతకన్నను వేదాంత మేమి కలదు ॥

వర్ణన - 24 పృచ్ఛకుడు ; శ్రీ పి. ఆనందరావు

అంశము : శివకేశవులకు అభేదము (ఉత్పలమాలలో)

అవధాని వర్ణన :

కేశవుఁ డొక్కఁడే ఘనుఁడు, కేశవుఁడే మన దైవమంచు, గౌ
రీశుఁడె దైవమంచు నతఁడే ఘనుఁడంచు వచించుచుంద్రు రా
యీశుని కేని, కేశవుని కేనియు భేదము గానరాదు, వా
రాశియు నొక్కరూపము, తరంగములే పదివేల రూపముల్ ॥

వర్ణన-25 పృచ్ఛకుఁడు : శ్రీ అంకిరాజు దత్తాత్రేయ

అంశము : రమానాధుఁడు, ఉమానాధుఁడు, వాణీనాధుఁడు
వీరు లోకకల్యాణము నెట్లు చేసెదరు ?
(చంపకమాలలో)

అవధాని వర్ణన :

చదువు నొసంగుచుండు, ఘనసంపద నిచ్చును, శక్తినిచ్చు, నా
పదలను గల్గనీక జనభావమునందున గౌరవాఖ్యసం
పదల నొసంగుచుందురఁట బ్రహ్మయు, విష్ణువు, నీశ్వరుండు, సం
షదమలభోగభాగ్యముల సాగఁగఁ జేతురు లోకు లెల్లరన్ ॥

వర్ణన - 26 పృచ్ఛకుఁడు : శ్రీ వై. సత్యనారాయణ

అంశము : మంచిప్రభువు లక్షణములు.

అవధాని వర్ణన : సామాజిక స్పందనం

ధర్మము నాల్గుపాదములఁ దారసిలన్వలె,రాజనీతిలో
మర్మ మెఱుంగగావలయు,మాన్యతనంది గమింపఁగావలెన్
భర్మమయంబు దేశమును భావ్యముగాఁ బరు లొందనీక, స
త్కర్మలు సేయుచుండవలె దక్షుఁడుగావలె రాజు కావలెన్ ॥

వర్ణన-27 పృచ్ఛకుఁడు : శ్రీ పాతూరి రవి

అంశము : దీపనిర్వాణ గంధము (శార్దూల వృత్తములో)

అవధాని వర్ణన :

పోగాలం బది దాపురించునెడలన్ బోఁగోరు శాస్త్రార్థవి
ద్యాగంధంబును స్వీకరింపరఁట, మిత్రప్రోక్త సంభాషణల్
రాగాలంచు నిరాకరింతురఁట తైలంబింక నిర్వాణమై
సాగన్ దివ్వెల తావి మూర్కొనరు నాశంబందు కాలమ్మునన్॥

వర్ణన - 28 పృచ్ఛకుఁడు : శ్రీ యం.వి. రమణ

అంశము : ఆదిశంకరులకు నేటి శంకరులకు పోలిక.

అవధాని వర్ణన :

మతవిద్వేషము లెక్కువైనపుడు సన్మానార్హుఁడై తాను బూ
జ్యత గల్గించెడి మార్గమందు కవితాసాంగత్యముంగూర్చి, యు
న్నతుఁడై సాగిన శంకరాఖ్యునకు వీణాపాణియైనట్టి భా
రతియై భారతి వచ్చినారిటకు తీర్థస్వామి సత్తీర్థులై ॥

వర్ణన - 29 పృచ్ఛకుడు : శ్రీ పరచ కిషన్‌రావు

అంశము : సగుణోపాసన చేయువారికి భగవంతుడు పుంలిం
గమా ! స్త్రీలింగమా ! నపుంసకలింగమా ! మఱి
యితరమైన దానిని ప్రతిపాదింతురా !

అవధాని వర్ణన :

లింగములందు నొక్కగుణలింగము చేర్పుడు రమ్యభావనా
లింగము మీకుఁ గల్గునెడ లేదు సమస్య రవంతయేనియున్
బంగరు పూలనుంచి యొకబాటను భద్రము సేసియుండనీ
లింగవివక్షతోడఁ బనిలేదు గ్రహింపుము లింగరాజమా ! ॥

వర్ణన - 30 పృచ్ఛకుఁడు : శ్రీ రాచర్ల సూర్యనారాయణశాస్త్రి

అంశము : శ్రీకృష్ణుని జారు డందురు చోరు డందురు, ఇది సత్యమా! అసత్యమా!

అవధాని వర్ణన :

జారుఁడు గాఁడు రక్తి ననిశమ్మును గైకొనుచుండు నాపయిన్
జోరుఁడు గాఁడు భక్తిఁ గనుచున్ గ్రహియించును,భక్తలోకమం
దారుఁడు దోషదూరుఁడు నుదారుఁడు వీరుఁడు,తా,నిరస్త భూ
భారుఁడు దేవలోక పరిపాలుఁడు జారుఁడు చోరుఁ డెట్లగున్ ॥

వర్ణన-31 పృచ్ఛకుడు : శ్రీ కె.వి. చలపతిరావు

అంశము : కంప్యూటర్ చిత్రగుప్తున కవసరమయినచో నెట్లుండును !

అవధాని వర్ణన :

రణగొణమంచు నీధ్వనుల లాస్యము లేమివిచిత్రమో, మహా
గణకముపైని శిక్షణకుఁ గావలె ట్యూట రొకండు,కాలముల్
గణనము సేయఁజాలమినిఁ గాలమిదే మొ, యకాలమందు మా
రణములు నెక్కువాయె నవురా యిది మాకును మారణం బగున్॥

వర్ణన-32 పృచ్ఛకుఁడు : శ్రీ యం.వి.యల్. నరసింహారావు

అంశము : మార్కండేయ పరముగా మానవుడు మరణము తప్పించు కొనవచ్చును.

అవధాని వర్ణన -

నొసటన్ వ్రాసిన వ్రాత దాచుటకు స్థాణుండేనియుం జాలఁ డ
య్యసమానుండు మృకండుసూతి పసివాఁడై భక్తివిశ్వాసముల్
మసలన్ గాలుని ధిక్కరింపఁగఁ ద్రిశూలం బాయుధంబైన వ
త్సనముఁ బ్రోచెడిరుద్రు వేడికొని భద్రం బాయువున్ బొందఁడే॥

వర్ణన - 33 పృచ్ఛకుఁడు : శ్రీ పాతూరి నాగరాజు

అంశము : ఒకవైపు స్వామివారి యుపన్యాసము, అవతల పూజయు జరుగు చుండగా ప్రేక్షకుల స్థితి.

అవధాని వర్ణన : వాక్పు చ మచ్ఛ్రుతి. మూసా వృత్తం

ఇందు నుందువొ యందు నుందువొ యెందు నుందువె చిత్తమా!
అందుచుండుఁ బ్రసాద మద్దరి, నందు జ్ఞానము నిద్దరిన్
విందు నోటికి నందు నద్దరి, విందు వీనుల కిద్దరిఁ
ఇందు నుందువ, అందు నుందువ యెందు నుందువొ చెప్పవే॥

వర్ణన - 34 పృచ్ఛకుఁడు : శ్రీ చక్రావధానుల రెడ్డెప్పధవేజీ

అంశము : సినిమాలలో వచ్చు(సుత్తి)పదముమీద స్తుతిమాల

పద్మనాభ వృత్తం

అవధాని వర్ణన : [illegible]

ఏనాడు జంధ్యాల పుట్టించెనోగాని, ఈనాటికిఁ నీవు నన్వీడకుంటే
ఆనాటనీనాట నయ్యావధానాల నార్జింతువే పెద్ద ముక్కాలిపీటన్
ప్రాణంబులందీయ మాయొద్దకున్ వచ్చి పద్యాబులంగోరి
తాడింతు వేలా !
ఈనాటికిన్ నిన్ను దిట్టన్ దగన్ ఛాన్సు నిచ్చెన్'ధవేజీ' వరుం,
డిందు సుత్తీ ! ॥

(ధవేజీ-పృచ్ఛకుని పేరు)

వర్ణన-35 పృచ్ఛకుఁడు: శ్రీలక్కింశెట్టి సూర్యనారాయణమూర్తి

అంశము : ఇంపుగా చేపలకంపు (చంపకమాలలో)

అవధాని వర్ణన : [illegible]

ముదమును గూర్చునట్టి కడుమోహమునందు వశుండఁగాన సం
పదల స్మరింపనేల స్మరభామిని ! నేను పరాశరుండ, నీ
యధరము నంట గంధవతివౌదువు నిక్కము,మత్స్యగంధి, నీ
మది నిఁక సంశయమ్ములను మానుము మాన్యము, కావు
తత్తడిన్ ॥

వర్ణన-36 పృచ్ఛకుడు : శ్రీ అద్దేపల్లి సోమనాధము

అంశము : తుంగభద్ర ప్రాశస్త్యము.

అవధాని వర్ణన :

రంగత్తుంగతరంగ వైభవములన్ రాజిల్లు నిన్గాంచుచో
గంగాసంగమ మిచ్చగింపఁడట తాఁ గావేరి దేవేరిగా
నంగీకార మొనర్పఁజాలఁడట,అయ్యాతీరు వైశిష్ట్య మా
శృంగేరీ గురుపాదపద్మముల స్పర్శింపంగ ధన్యాత్మవే ॥

వర్ణన-37 పృచ్ఛకుఁడు : శ్రీ కొండూరి నారాయణమూర్తి

అంశము : కార్మికులు సంస్కృతము నేర్చుకొని సాంకేతిక విద్యను పెంపొందించుకొనుట.

అవధాని వర్ణన :

కార్మికు లైనవారు తమ కార్యములందు విశేషబుద్ధి గం
గోర్మివిలోల మాలికల యొప్పులచొప్పు ఘటింప నెంచుచున్
భర్మమయంబుఁ జేయుటకు,భావమయంబగు సంస్కృతంబు,తా
నర్మిలిలేక కార్యములయందుఁ జరించెడి నేర్చుకొన్నచో ॥

వర్ణన-38 పృచ్ఛకుఁడు : శ్రీ కొండూరి సుబ్రహ్మణ్యం

అంశము : శివునితలపైనున్న చంద్రునిపై మానవుడు కాలు మోపగా, శివు డేమని భావించును ? చంద్రు డేమని భావించును ?

అవధాని వర్ణన :

ప్రవరుండల్ల హిమాచలంబు గదియన్ బాదమ్ములందుండు, లి
ప్తవిశేషౌషధి తా ద్రవించె, నటు మేధాశక్తి పెంపొందెనో
యవలీలన్ నడయాడుచుండెఁ దలపై నానాటి కానాడు మా
నవులన్, గౌరవ మేల డిగ్గినది చంద్రస్పర్శ కావింపగన్ ॥

వర్ణన - 39 పృచ్ఛకుఁడు : శ్రీ ఈరని శ్రీరామశర్మ

అంశము : మహిషాసుర సంహారములోని అమ్మవారు మన లోని కల్మషములు పోగొట్టుటకు ఎట్లు తోడ్పడును.

అవధాని వర్ణన :-

మనమే మాహిషరూపమం చెఱిఁగి సన్మానింప నర్హంబుగా
దని బోధింపఁగ, దేవి, నాటి యసురన్ బ్రాణంబులం దీయగా
గని తత్త్వంబు నెఱుంగుమోయి. స్మృతులం గావ్యంబులందున్ సనా
తనమై వచ్చెడి యంతరార్థమును సంధానింపుమా! సమ్మతిన్" ॥

వర్ణన - 40 పృచ్ఛకుఁడు : శ్రీ హెచ్. హరిశ్చంద్రారెడ్డి

అంశము : తల్లిదండ్రులను, గురువులను, స్తుతించుచు మీ పేరు పొందుపఱచి, యొక పద్యము చెప్పుడు.

అవధాని వర్ణన :-

కడిఘెళ్ళాన్వయజాత శేషయకు వేంకట్రామశాస్త్రిన్ బ్రసా
దుడుగాఁ జేయఁగ భారతీసతికి నాధుంజేయుఁ దద్భారతీ
త్రిడుపద్గ్రాహ్య వరప్రసాదుడ సవిత్రీమూర్తికిన్ జ్యేష్ఠుఁడన్,

వర్ణన - 41 పృచ్ఛకుఁడు : శ్రీ కె. నాగేశ్వరరావు

అంశము : వివాహసమయమునకు పురోహితుడు రాకున్నచో వధూవరులస్థితి.

అవధాని వర్ణన :-

అక్షతలను వేయ నార్యులు వచ్చిరి
పేరటాండ్రు వచ్చి విడిదిఁ గొనిరి
మమ్ముఁ గలుప నేడు మాయమయ్యెను బురో
హితుఁడు గాఁడు వాఁ డహితుఁడుగాని॥

వర్ణన - 42 పృచ్ఛకుఁడు : శ్రీ రాంభట్ల శివప్రసాద్

అంశము : పరీక్షాఫలితములు భిన్నవార్తాపత్రికలలో, భిన్నవిధములుగా వచ్చినపుడు, ఆవిద్యార్థి తల్లిదండ్రుల స్థితి.

అవధాని వర్ణన : కొసమెఱుపుగా చెప్పిన చమత్కృతి.

సంతస మొక్కవంకను విచారము వేఱొకవంకఁ గల్గె, నే
డెంతటి ఘోరమా యని దహించి కృశించి గమించుటాయె, నీ
వింతల వింత హేతువులు వీనినిఁ బత్రికలం గ్రహించి, కా
ఖింతును భస్మశేషముగ నింతకుమించి యిఁకేమి చేసెదన్॥

వర్ణన - 43

పృచ్ఛకుఁడు : శ్రీ అత్తలూరి రాధాకృష్ణమూర్తి

అంశము : తిరుపతి వేంకటకవులపై (చంపకమాలలో) ప్రశంస.

అవధాని వర్ణన :

పటుపు కవిత్వవైఖరిని బారము ముట్టిన సత్కవీంద్రులై
తిరుపతి వేంకటేశ్వర సుధీమణులాచుఁ జెలంగు వారు, నీ
శ్వరవరదత్త సత్కవనసంగతి నీయవధానమందు భా
సురముగఁ గూర్చిపేర్చి కడుశోభనొసంగిరి యాంధ్రభాషకున్॥

వర్ణన - 44 పృచ్ఛకుఁడు : శ్రీ టి. రామగోపాల్

అంశము : శంకరభగవత్పాదులు పరుల వాదమును పరాస్తము చేయు వాదసభలో సభ్యుల మనోభావములు.

అవధాని వర్ణన : కల్పనా చమత్కృతి

పాండిత్యమ్మును భక్తియున్ గవితయున్ భాసిల్ల వేదాంతి వే
దండమ్మై నడయాడు శంకరుని వాదంబందు నోడింపఁగా
కుండన్ దాము పరాభవమ్ము గొని పీయూషమ్ము సేవించి రా
కుండన్ సాగదు వీనితో నని సదస్యుల్ వెన్ను చూపింపరే॥

వర్ణన - 45

పృచ్ఛకుఁడు : శ్రీ కొమ్మరాజు రాధాకృష్ణమూర్తి

అంశము : రాముని అంగుళీయకమును చూచిన సీతయొక్క భావము.

అవధాని వర్ణన : పౌరాణిక కల్పన

శంకరుఁడైన రామవిభు సన్నిధి వాసముచేసి, నాథ నా
మాంకితమైన యుంగరమునందు విభుండగుపించుచుండగా
అంకిలి లేని వేడ్క మది నబ్ధితరంగములట్లు పొంగి బా
ష్పాంకిత నేత్రయయ్యె, జనకాత్మజ, పావని చూచుచుండగన్॥

వర్ణన - 46 పృచ్ఛకుఁడు: శ్రీ లంకా వెంకటసుబ్రహ్మణ్యం

అంశము: మైకు మీద పద్యము.

అవధాని వర్ణన :-

పండితులు మేటి కవులును వచ్చినారు
స్త్రీలు పురుషులు పెద్దలు చేరినారు
సరసమగు వేళలో విరసమ్ముగాఁగ
ట్రిక్కు చేయకుమో యెలక్ట్రిక్కు మైక॥

వర్ణన - 47 పృచ్ఛకుఁడు: శ్రీ వి. నారాయణ

అంశము: చావకముందు నిత్యమును చచ్చుచు, బ్రతికియున్న వాఁడు జీవన్ముక్తుఁడు.

అవధాని వర్ణన :-

ఈ ప్రపంచమందు నెల్లవేళలయందు
చావకుండ్రు సతము చచ్చుచుండ్రు
పిఱికితనము మదిని పెరుగఁగుండినవాడు
బ్రతుకుకాదు, అతుకు బొతుకు బొంత॥

వర్ణన - 48 పృచ్ఛకుఁడు : శ్రీ వి. నాగభూషణరావు

అంశము : రామతత్త్వము.

అవధాని వర్ణన :-

రాముఁడు సర్వరాక్షసవిరాముఁడు నాశ్రితకల్పశాఖికా
రాముఁడు దైవరూపమున రంజిలుచుండఁగ, సీత, శక్తియై
కామము నన్యులందుఁ గలుగన్ బరలోకము సూతురంచు ని
ష్కాములుగాఁగ నుండుటకుఁ గావలె దీక్ష యటంచుఁ
జెప్పెడిన్॥

వర్ణన - 49 పృచ్ఛకుఁడు : శ్రీ జి. హనుమంతరావు

అంశము : మంచిగా ఉన్నపుడు చెడుగా ఉన్నపుడు, నవగ్రహ గుణములు ఎట్లుండును ?

అవధాని వర్ణన :-

సహనమ్మొక్కటి కల్గునాడు కడు దుష్టమ్మై ప్రవర్తించు నే
గ్రహమేనినన్, నినుఁ బట్టఁజాల దిఁక నేలా నీకు సందేహమ్ముల్
సహవాసంబను దోస మొక్కటి మదిం జాలించి నేఁడేలకో
గ్రహపాటో పొరపాటొ యంచుఁ బలుకన్ గాలమ్ము
వ్యర్థమ్మగన్॥

వర్ణన - 50 పృచ్ఛకుఁడు : శ్రీ మోచర్ల నాగరాజు

అంశము : సభావర్ణనము.

అవధాని వర్ణన :

కాషాయాంబర వేషధారు లిట శ్లోకస్థానముం గూర్పఁగన్
రోషావేశములందు లొంగి, కవితారూపమ్ముగాఁ జూపుచున్
భాషింపంజనువారు ప్రేరణ, కవిత్వమ్మందుఁ గల్పించి, ని
శ్శేషంబై యలరారఁజేయు జను లాశీర్వాదముం గూర్చెడిన్॥



## వర్ణన పద్యముల పేర్లు

| వర్ణన నెం | పద్యము పేరు |
|---|---|
| 1. | సీసము |
| 2. | కందము |
| 3. | లయగ్రాహి |
| 4. | ఉత్పలమాల |
| 5. | లయహారి |
| 6. | ఆటవెలఁది |
| 7. | హయప్రచార రగడ |
| 8. | నర్కుటము |
| 9. | ఉత్పలమాల |
| 10. | జలదవృత్తము |
| 11. | ఉత్పలమాల |
| 12. | మత్తేభము |
| 13. | చంపకమాల |
| 14. | మత్తేభము |
| 15. | శార్దూలము |
| 16. | మత్తేభము |
| 17. | ఆటవెలఁది |
| 18. | శార్దూలము |
| 19. | మత్తేభము |
| 20. | చంపకమాల |
| 21. | మత్తేభము |
| 22. | శార్దూలము |
| 23. | తేటగీతి |

24. ఉత్పలమాల
25. చంపకమాల
26. ఉత్పలమాల
27. శార్దూలము
28. మత్తేభము
29. ఉత్పలమాల
3.0 ఉత్పలమాల
31. చంపకమాల
32. మత్తేభము
33. మత్తకోకిల
34. పద్మనాభవృత్తము
35. చంపకమాల
36. శార్దూలము
37. ఉత్పలమాల
38. మత్తేభము
39. మత్తేభము
40. మత్తేభము
41. ఆటవెలంది
42. ఉత్పలమాల
43. చంపకమాల
44. శార్దూలము
45. ఉత్పలమాల
46. తేటగీతి
47. ఆటవెలంది
48. ఉత్పలమాల
49. మత్తేభము
50. శార్దూలము